'దేవ్యాస్తతో విమనసః పరిసాంత్వనాయ
ధర్మాసనా ద్విశతి వాసగృహం నరేంద్రః'

రాముడింతవఱకును ధర్మాసనమున రాజ ధర్మములను నిర్వహించుచుండి, యిపుడు సతీపరిసాంత్వనార్థమై ధర్మాసనమును వీడినాడు. సతీ సంబంధమగు నత్యను రాగము ధర్మనిర్వహణమునకు అడ్డువచ్చినది. అనుద్దిష్టముగ స్వధర్మవిషయమున జరిగిన యీ లోపలేశమే తర్వాతి విషాదగర్భిత కథకంతకును హేతువని యూహింపనగును. ఇంత మాత్రముచే రాముడు ధర్మవిముఖుడనిగాని, ధర్మనిర్వహణమునందు ప్రమత్తుడనిగాని చెప్పరాదు. తన జీవితమునంతను ధర్మనిర్వహణమునకై ధారవోసిన పురుషోత్తముడు శ్రీరాముడు. సర్వవిధములగు ధర్మములను పోషించుటలో శ్రీరాముడు తన జీవిత సౌఖ్యములనే త్యాగమొనర్చినాడు. ఉదాత్తులగు నిట్టి నాయకుల విషయమున కలుగు లోపలేశమెల్లప్పుడును అనుద్దిష్టపూర్వకమును, విధిప్రాబల్య మూలమును నైయుండు ననుటలో సందేహములేదు. నలుడు, ధర్మరాజు మున్నగు నుత్తముల విషయమునకూడ నిట్లే జరిగినది. సీతాపవాదమునుగూర్చి రాముడు వినుట, ప్రజారంజనార్థ మామెను కానల కంపుట, తత్కారణముగా సీతారాము లిర్వురును నిరవధిక దుఃఖము ననుభవించుట,— ఇదంతయు విషాదగర్భితమే యైయున్నది. నాయికానాయకులకు కడపట పునస్సంయోగము కూర్పబడియున్నను, ఆదినుండి తుదివఱకును పోషితమైయున్న యితివృత్తము విషాదగర్భితమై యున్నదనుటలో సందేహములేదు. ఈ శోకము నాధారముగ చేసికొనియే కరుణను పోషించుటకు కవి కవకాశము గల్గినది. దుర్ముఖునివలన అపవాద విషయమును వినిన రాముడు రాజధర్మము నిర్వహించుటకై తన బహిఃప్రాణమగు సీతను త్యజింప నిశ్చయించినాడు. కాని సీతను కానల కంపుట యెట్లు? బాహాటముగా సీతకు యథార్థమును తెల్పుటెంతయు క్రూరము, ననుచితము నగును. పూర్ణ గర్భిణియు, సుకుమార శరీరయు, భర్తైక జీవితయునగు సీతకు రాముడపవాదమును గూర్చి యెట్లు చెప్పగలడు? లోకాపవాద విషయమును భర్తనోట పలికించుటకన్నను అనౌచిత్యము వేఱొండుండదు. అదియుగాక అశనిపాతమువంటి తద్వార్తను వినిన సీత దానినోర్చి కాననమునకు ప్రయాణమగుట యెట్లు? సాధారణ సంఘమునగూడ నిట్టిది క్రూరము, అనుచితము నగును. ఇట్టి సంఘటనను భవభూతి నిర్వహించిన విధము ప్రశంసింపదగినది. చిత్రపట సందర్శనముచే భాగీరథీ తీరప్రదేశములందు మఱల విహరింప వలెననెడి కోరిక సీతాదేవికి కల్గుటయు, గర్భిణియగు సీత కోరికలను తప్పక నెరవేర్పవలసిన

దని అరుంధత్యాదులు రామునకు సందేశమంపుటయు—అను నంశము లీవిషయము నందుపకరించినవి. సీతాదేవికి కల్గిన యీ కోరికను పురస్కరించుకొనియే రాము డామెను భాగీరథీప్రాంత భూముల కనుపగల్గినాడు. ఇక, తల్లులగు కౌసల్యాదు లును, గురు జనులగు అరుంధతీ వసిష్ఠులును, గృహమునందుండినచో, సీతా వన గమనమునకు ప్రతిబంధకము కలుగకపోదు. గురుజనులింటనుండియు, పూర్ణ గర్భిణియగు సీత నడవులకు పంపుట జరుగదు. వంశప్రతిష్ఠా రక్షణార్థమై యొకవేళ రాముడు సీతను త్యజింప నిశ్చయించుకొన్నను కౌసల్యాదులు కోడలిని పితృ గృహమునకు పంపుదురుగాని అడవుల కంపజాలరు గదా ! కావున గురుజను లెవ్వరును ఆ సమయమునందింట లేకుండునట్లు సంవిధాన మేర్పరుపవలసివచ్చినది. రామాయణకథ ననుసరించి శ్రీరామునకు కుశలవులతోడి సమాగమము పండ్రెండు సంవత్సరములకు పిమ్మట జరిగినది. అంతకాలమును కౌసల్యాది గురుజనులు గృహమున లేకుండునట్లు చేయుటకై భవభూతి ద్వాదశ సత్త్రవిషయమును కల్పింప వలసివచ్చెను. ఆ యజ్ఞ నిర్వహణార్థమై గురుజనులెల్లరును ఋష్యశృంగాశ్రమ మున పండ్రెండు సంవత్సరములు నిల్చుటచే సీతా వనవాసగమనమునకును, తద నంతరము జరిగిన విషయములకును అవకాశము కల్గినది. ప్రథమాంకమున కవి ప్రవేశపెట్టిన ప్రతి విషయమును తదనంతర కథాప్రవృత్తికి సాధకమైనది. ఋష్య శృంగాశ్రమమునుండి వసిష్ఠమహర్షి సీతకంపిన సందేశమిది :—

విశ్వంభరా భగవతీ భవతీ మసూత
రాజా ప్రజాపతి సమో జనకః పితా తే
తేషాం వధూస్త్వమసి నందిని పార్థివానామ్
యేషాం కులేషు సవితా చ గురుర్వయం చ ॥

"విశ్వంభర యగు భూదేవి నీకు తల్లి ; ప్రజాపతి సముడగు జనకుడు తండ్రి ; సవితృడును నేనును గురువులగు రాజులకు నీవు కోడలవు." ఈ సందేశమెట్లు భావగర్భితమైయున్నదో గమనింపవచ్చును. సకల చరాచరములను ఎల్లర పాప పుణ్యములను, సర్వమును భరింపగలది గనుకనే భూదేవి విశ్వంభరయగుచున్నది. సహనమునకు భూదేవి ఆదర్శము. ఆమె తనూజాత యగు సీతయు, తల్లితో సమానమగు సహనమును ప్రదర్శింపవలసియున్నది. ప్రజ లామెపై మోపిన అప వాద భారమును, భర్త త్యజించుటవలనగల్గిన అవమాన భారమును, మీదు మిక్కిలి ప్రియపతి వియోగభారమును సీత భరింపవలసియున్నది. ఈవిషయ మంతయు వసిష్ఠ సందేశమందలి యీప్రథమవాక్యమున సూచితమైయున్నది. ప్రజాపతిసముడగు

జనకుని పుత్త్రియగుటచే ప్రజారక్షణ కర్తవ్యము సీతకును గలదని సూచన. తన్ను నిందించిన ప్రజలపై ఈమె కోపమూనకుండుటకు ఇది ఉపకరించుచున్నది. తండ్రి బ్రహ్మజ్ఞాని యగుటచే సీతయు తనకు గల్గిన యాపదను విధివిలాసముగా గ్రహింపవలెనని యిది సూచించుచున్నది. పావిత్ర్య చైతన్యములకు స్థానమును, పరోక్షపురుషుడును నగు సవితృని, గురుస్థానమందున్న వసిష్ఠుని, తలచి వంశరక్షణ గావింపవలసిన బాధ్యత సీతపై నున్నదనియు నీ తృతీయ వాక్యమున సూచింపబడి యున్నది. సీతావిషయకమైన ఉత్తరకథార్థమంతయు కవి యిట్లు సందేశ వాక్యములలో గర్భితమొనర్చియున్నాడు. వసిష్ఠుడు రామునకంపిన సందేశముకూడ నిట్లే అర్థవంతమైయున్నది.

జామాతృయజ్ఞేన వయం నిరుద్ధాస్త్వం బాల ఏవాఽసి నవంచ రాజ్యం।
యుక్తః ప్రజానామనురంజనే స్యాస్తస్మాద్యశో యత్పరమం ధనం వః॥

రామున కింకను రాజ్యానుభవము చాలదనియు, వయస్సు చాలమిచే, ధర్మనిర్ణయము కష్టమనియు, కావున ప్రజారంజనమునే ఆదర్శముగ నిడుకొన్నచో ధర్మము పాలితము కాగలదనియు సారాంశము. దీనిని గ్రహించియే రాముడు, ప్రజారంజనార్థమై జానకనైన వదలుటకు తాను సంసిద్ధుడని పలికి ధర్మపాలనమున తనకుగల ఆసక్తిని ప్రదర్శించినాడు. సీతాత్యాగనిర్ణయమునకు గురుని యాదేశముగూడ దోహద మొనర్చునట్లు కవి సంవిధాన మేర్పరచుటయే కాక, సీతాత్యాగవిషయమును రాముని నోటనే చెప్పించియుండుట గమనింపనగును. దీనిని పాశ్చాత్యులు నాటకీయధ్వని (Dramatic Irony) యని పేర్కొందురు.

ప్రథమాంకమున కవి కల్పించిన యంశములలో చిత్రపట సందర్శనము కథాసంవిధానమునకు చాల ముఖ్యమును, విశిష్టభావపోషకమునునై యున్నది. సీతాదేవి వినోదార్థము చిత్రపటము రచితమైనదని రాముదెఱిగి, అది యెంతవఱకు ముగిసినదని లక్ష్మణుని ప్రశ్నించును. 'సీతాదేవి యగ్నిశుద్ధివఱకును' అని లక్ష్మణుడు పల్కుటయు, రాముడది విని ఖిన్నుడై 'దేవీ! ఇది నీకు జీవితావధి యగు ప్రవాదము' అని పల్కుటయు నారంభమునందే కలదు. సీతకు ముందు కల్గబోవు జనాపవాదమును కవి ముందుగనే యిట్లు సూచించుచున్నాడు. "జీవితావధియగు ప్రవాదము" అనెడి ప్రయోగముకూడ ఉద్దిష్టపూర్వకము. చిత్రపట సందర్శనమున ప్రప్రథమమున సీతకు గోచరించినది జృంభకాస్త్రముల దృశ్యము. దివ్యములగు నీ జృంభకాస్త్రములు ధర్మసంరక్షణార్థమువందు రామునకు సాధనము లైనవో, వానితో చిత్రపటసందర్శన మారంభించుటచే నిందును ధర్మము

రక్షితము కాగలదనెడి సూచనగలదు. సీత వానికి నమస్కరించుటతోడనే తదస్త్రము లామె గర్భస్థసంతానమునకు చెందుగాత మని రాముడాశీర్వదించినాడు. షష్ఠాంకమున కుశలవులతో రామునకు సమాగమముకలిగినపుడు వారికి జృంభకాస్త్రములు సిద్ధించియుండుటను గమనించిన రాముడు వారిని సీతాపుత్త్రులుగా శంకించుటకిది యాధారమైనది. సప్తమాంకమున జృంభకాస్త్రాధిదేవతలు ప్రత్యక్షమగునట్లుకూడ కవి యేర్పరచినాడు. సీతారాముల దివ్యత్వమాహాత్మ్యములు ప్రజలకు ప్రత్యక్షమగుటెంతయు ఆవసరమైనది. ప్రజలు తలలువంచి తమపాపమునకు పశ్చాత్తాపమును వెల్లడించినారు. ఇట్లీ జృంభకాస్త్రవిషయము కథతో అనుబంధించియున్నది. పటమున చిత్రితమైయున్న గంగానదికి రాముడు నమస్కరించి తద్దేవత నుద్దేశించి, "తల్లీ! అరుంధతివలె నీవును నీకోడలగు సీతకు మంగళమును కూర్చుదానివి కమ్ము" అని ప్రార్థించినాడు. పిమ్మట అపవాదశ్రవణానంతరము, రాముడు నిద్రించుచున్న సీతను వదలిపోవుచు, భూదేవి నుద్దేశించి 'భగవతీ! వసుంధరాదేవీ! సుశ్లాఘ్యయగు నీ బిడ్డను కాపాడుకొనుము' అని ప్రార్థించి నిర్గమించినాడు. రామపరిత్యక్తయై భాగీరథిలో తన్నుదా వైచుకొన్న సీతను భాగీరథి రక్షించుట, ఆమె కుమారులను, యుక్తకాలమున వాల్మీకి కప్పగించుట, రాముడు దండకారణ్యమునకు వచ్చిన సందర్భమున నాపదను శంకించి సీతాతమసల నందు బంపి రాముడు రక్షితుడగునట్లొనర్చుట, కడపట వసుంధరాద్వితీయయై రామునకు సీత నప్పగించుట, మున్నగు కథాంశములన్నింటికిని ఈ ప్రథమాంకమునందలి రాముని ప్రార్థనలతో సంబంధమేర్పడియున్నది. చిత్రపటసందర్శనమువలన కవి సాధించిన మరియొక విశిష్టప్రయోజనమును గలదు. సీతారాములకు ముమ్ముందు వియోగము కలుగనున్నది. కవి రామునిచే పలికించి నట్లీ వియోగము దుర్భరమైనది. రావణుడొనర్చిన సీతాపహరణము కారణముగా పూర్వము కలిగిన వియోగమున కొక అవధి యుండినది. శత్రుసంహారణముతో సీతాపునస్సమాగమము సాధ్యమనెడి ప్రత్యాశాప్రత్యయములును, శత్రుసంహారక విషయకమగు చిత్రమును, తద్విషయమున రాముడొనర్చిన మహాప్రయత్నమును, ఆ వియోగబాధ నతడు సహించునట్లు చేసినవి. ఇపుడు కలుగబోవు రెండవవియోగమట్టిదికాదు. [illegible] సీతను త్యజించుటచే దుస్సహమును, తత్త్యాగము జనాపవాదమూలకమగుటచే నిరవ చున్నది. ఇట్టి దుస్సహము, ప్రత్యాశారహితము నగు వియోగదుఃఖము సీతారాములకు ప్రథమాంకకథాంతమున కలుగనున్నది. ద్వితీయాంకారంభము నుండియు, తుదివఱకు మనకిది ప్రత్యక్షగోచరమగుచునేయున్నది. రావణ

సధారిగా నింతవఱకును విశ్రాంతులై సుఖులై యుండిన నాయికానాయకుల కొక్క సారిగా నిట్టి వియోగదుఃఖము సంభవమగుచో నది హృదయమున కాఘాతము కాగలదు. ఒక్కసారిగా గల్గిన ఆఘాతము వలన కరుణరసస్ఫూర్తి కలుగదు. రస పోషణమనునది యెప్పుడును క్రమపరిణామము ననుసరించి జరుగవలెను. ఆలంబన విభావముచే నుద్బుద్ధమైన భావము క్రమపరిణామమునకు లోనై బహువిధములు, స్థాయిభావపోషకములు నగు నితర సన్నివేశములచే పుష్టమై, క్రమపరిణామముచే పక్వమై రసస్థితిని పొందవలసియున్నది. ఇది మానవమనస్తత్త్వమున కనుగుణ మైన విధానము. కావున నీచిత్రపటసందర్శనము నాధారముగా కవి సీతారాముల హృదయములను భావిదుఃఖానుభవమునకు సిద్ధమొనర్చుచున్నాడు. తమకు పూర్వము కల్గిన వియోగమంతయు చిత్రపట సందర్శనము వలన స్మరణకు రాగా, నాయికా నాయకులు భావనావ్యాపారమునకు లోనై తద్వియోగమును నూతనముగ మఱల ననుభవించుచున్నట్టి స్థితికి లోనగుచున్నారు. చిత్రితములైన పూర్వదృశ్యము లాధారముగా ప్రభూతమగు భావనకధీనులై వాస్తవపరిస్థితులను విస్మరించి సీతా రాము లిద్దరును వియోగదుఃఖమునకు మఱల పాల్పడివారు. మహాగంభీరుడగు రాముడుకూడ పూర్వవృత్తాంతస్మరణచే చలింపగా లక్ష్మణుడు "అన్నా! యేమిది" అని హెచ్చరింపవలసివచ్చినది. సీతయు నట్లే రాముని వియోగమును తానప్పు డనుభవించుచున్న దానివలె దుఃఖించినది. నాయికానాయకు లిట్లు చిత్రపటసందర్శన సందర్భమున దుస్సహవియోగ దుఃఖమునకు లోనగుటవలన తదనంతరము కల్గిన వియోగదుఃఖము నోర్వగల్గినారు. ప్రథమాంకముననే యామెకు వియోగమేర్పడు సంఘటన గల్గినది. దుర్ముఖునివలన నపవాద విషయమును విన్నదే తడవుగ రామునకు దుఃఖమారంభమైనది. చిత్రపట సందర్శనముచే గలిగిన విరహభావన ప్రబలమై నిద్రలో సీత కలవరించునట్లుగూడ చేసినది. "హా! ఆర్యపుత్త్రిడా! ఎట నున్నావు?" అని సీత దుర్ముఖుని ప్రవేశమునకు పూర్వమే పలవరించినది. ఈ విధమున భావివిరహదుఃఖానుభవమునకీ ఘట్టము పోషకమైయున్నది. మఱియు పటమున చిత్రితములై యున్న భాగీరథీతీరప్రదేశములను గాంచుట వలననే మఱల నందు విహరింపవలె ననెడి కోర్కె సీతకు కల్గుటయు, రాముడద్దానిని పురస్క రించుకొని యామెను కానలకు పంపి రాజ ధర్మమును నిర్వహింపకల్గుటయు పొసగినది.

ఈ ఘట్టము సాధించిన మఱియొక విశిష్టప్రయోజనమును గలదు. జనస్థాన మున పర్యటించుచున్న రాముడు, సీతను స్మరించుకొని ఉత్కటమగు శోకమునకు

లోనై మఱల మఱల మూర్ఛకులోనైనాడు. అట్టి మూర్ఛనుండి యితనిని ఉజ్జీవింప చేసినది సీతా హస్త స్పర్శ :—

'త్వమేవ నను కల్యాణి సంజీవయజగత్పతిమ్,
ప్రియస్పర్శో హి పాణిస్తే తత్రైష నిరతోజనః'

అని తమస సీతను హెచ్చరించినది. సీతాస్పర్శచే రాముడు ఉచ్ఛ్వసిల్లుటయే కాక, అది సీతాస్పర్శయనికూడ గుర్తింపకల్గినాడు. గుర్తించుట మాత్రమే కాక సీతాస్పర్శవలన తనకుగల్గిన విశిష్టానుభూతి యెట్టిదో పలువిధముల వర్ణించుకొని ఆనందించినాడు. మూడవయంకమందు జరిగిన వృత్తాంతమిది. సీతా హస్త స్పర్శకును రాముని యందది కల్గించు ననుభూతికిని గల సంబంధ మెట్టిదో యితః పూర్వమే సూచితమైయుండవలయును. అట్లుచేయక తృతీయాంకమందే సంఘటనము నొక్కసారిగా కల్పించినచో నది అస్వాభావికమై కన్పట్టకపోదు. పూర్వమెందును తత్ప్రశంసయే చేయక యిట్టి విషయము నొక్కసారిగా ప్రవేశపెట్టినచో నది అసహజముగ తోచుటయేగాక, ఉద్దిష్టప్రయోజనమునుగూడ సాధింపజాలక పోవును. దీనిని గుర్తించియే భవభూతి ప్రథమాంకమునందే సీతా హస్తస్పర్శ ప్రశంసకు తావొసంగినాడు. చిత్రపటసందర్శనముచే కల్గిన విరహవ్యథ ననుభవించి అలసియున్న సీతకు రాముడాలంబన మిచ్చుచు, నామె బాహువునకు తన భుజము నాధారమొనర్చినాడు. తత్స్పర్శచే రామునకు కల్గిన అనిర్వచనీయమగు ననుభూతి యందు వర్ణితమైనది :—

'వినిశ్చేతుం శక్యోన సుఖమితివా దుఃఖమితివా
ప్రమోహో నిద్రావా కిమువిషవిసర్పః కిముమదః
తవస్పర్శే స్పర్శేమమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యంభ్రమయతి చ సమ్మీలయతిచ.'

సీతా స్పర్శకు రాముని హృదయముపైగల ప్రాబల్యమిట్టిది. సుఖదుఃఖమోహనిద్రాదుల కన్నిటికిని విభిన్నమై, వానికంటెను విశిష్టమై, రాముని మనోదేహములను రెంటిని మోహమున ముంపజాలిన సీతాస్పర్శ, అతని జీవితమున శాశ్వతప్రతిష్ఠానమును గల్గించినది. తదనుభూతివలన సిద్ధించిన యానందము రాముడు మరువజాలడు. కావుననే జీవితము నందెప్పుడు నెట్టి స్థితిలో తత్స్పర్శకల్గినను రాముడు దానిని గుర్తింపగల్గుచున్నాడు. ఇట్లు ప్రథమాంకమున చిత్రితమైన యీ విషయము తృతీయాంకమందలి సంఘటనతో ననుసంధించుచున్నది. ఇది ప్రకృతిసహజమైన

విషయమా ? అను సందేహము కొందఱకు కలుగవచ్చును. అన్యోన్యానురాగ బద్ధులగువారి జీవితములలో నిది స్వాభావికమును, సాధ్యమును ననుట సహృదయు లెఱింగిన విషయము. స్పర్శాదులకుగల ప్రాబల్యము ప్రేయసీప్రియులగాఢాను రాగముపై నాధారపడియుండును. బిడ్డల స్పర్శను తల్లి గుర్తింపగల్గుటయు; భర్త పాదధ్వనిని దూరమునుండియే భార్య గుర్తింపగల్గుటయు, నిత్యాదులు సాధారణ లోక విషయములు. [Wreck అను నవలలో రవీంద్రుడిట్టి సన్నివేశమును కల్పించి యుండుట గుర్తింపనగును.] కావున సీతారాముల గాఢపరస్పరప్రేమకు నిదర్శనమగు సీహస్తస్పర్శ విషయము రమణీయము, సహజమునై యున్నది.

ఇతివృత్తమంతయు సీతావిషయకమగు జనాపవాదకముపై నాధారపడి యున్నది. సీతానిరాసమునకు నదియే మూలము. రాజ ధర్మమును పాలింపవలె ననెడి రాముని యత్యుత్సాహమే, సతీత్యాగమున కతనిని పురికొల్పినది. తద్ధర్మ ప్రశంసకుగూడ కవి ప్రథమాంకముననే ఆకరమిచ్చియున్నాడు. ప్రస్తావనయందు సూత్రధారుడు, "రాజద్వార మాశ్రయించి కులధర్మమును నిర్వహింత"మనియు— "సర్వథా వ్యవహర్తవ్యం కుతోహ్యవచనీయతా" — అనియు పలికియున్నాడు. ఇతరుల నిందావాక్యములనుగాని, విమర్శననుగాని లెక్కింపక, కులధర్మమును పాలించుటయే కర్తవ్యమనెడి యుదాత్తభావ మిందుద్ఘాటితమైనది. రాముడు పాటించిన కులధర్మమునకిది సూచకము. ఈ విధమున నాటకకథాసంవిధానమునకు వలయు ప్రణాళికనంతయు కవి ప్రథమాంకముననే సమకూర్చుకొనియున్నాడు.

ప్రథమాంకకథావృత్తాంతమునకు తర్వాత పంద్రెండు సంవత్సరములకు జరిగిన కథాంశముతో ద్వితీయాంక మారంభమగుచున్నది. ప్రథమద్వితీయాంకేతి వృత్తములను కవి విష్కంభముచే ననుసంధించినాడు. [ఇట్టి సందర్భములలో పాశ్చాత్యులు Chorus అను పాత్రను ప్రవేశపెట్టి పూర్వోత్తరేతివృత్తములను అనుసంధింపజేతురు. కథతో మఱియెట్టి యితర సంబంధములేని వ్యక్తి Chorus. సంస్కృతరూపకములలో కథతో సన్నిహిత సంబంధమున్న పాత్రలే విష్కంభప్రవేశకముల ద్వారా యీ ప్రయోజనమును సాధింతురు. [illegible] స్వాభావికతను పాఠకులు గుర్తింతురుగాక!] సీతాపవాదవృత్తాంతము, కౌసల్యాదుల ఋష్యశృంగాశ్రమమునుండి వాల్మీక్యాశ్రమమునకు వచ్చుట, రాముని యశ్వమేధ యాగ ప్రయత్నము, చంద్రకేతుపురాకన, శంబూకవధార్థమై రాముడు దండకారణ్యమునకు వచ్చుట, ఇత్యాదికథావిధాన మిందు సూచితమైయుండుటచే పూర్వోత్తరేతి

వృత్తములకు సన్నిహిత సంబంధమేర్పడినది. ఇంతియకాక, వాల్మీక్యాశ్రమమున పెరుగుచున్న కుశలవుల వృత్తాంతముకూడ నీ విష్కంభమునందు ప్రసన్నముగ సూచితమైయున్నది. శంబూకవధ, శంబూకుడు దివ్యరూపమును ధరించి రాముని పూజించుట, తర్వాతి కథాంశములు. ఇది దండకారణ్య భాగమనియు, జనస్థాన మచటికి సమీపమనియు శంబూకునిచే రాముడెఱుంగును. రామునకు చిరపరిచిత ములగు ప్రదేశములను శంబూకు డతనిస్మరణకు తెచ్చినాడు. తృతీయాంక మందలి కథాభాగమున కిది యనుసంధానము. రాము డాయా పరిసరములను గాంచి, యవి తాను పూర్వము సీతాద్వితీయుడై, విహరించి యానందించిన ప్రదేశము లగుటచే నామెను స్మరించుకొని వియోగదుఃఖ మనుభవించుట తృతీయాంకమందు పోషితమైన విషయము. దానికి ద్వితీయాంక కథాభాగము పునాది యగుచున్నది.

ధర్మనిర్వహణము నందుత్సుకుడై యున్న రాముడు ప్రజాపవాదకారణమున సీతను త్యజింపవలసివచ్చినది. రామునకు సీతపైగల ప్రేమగౌరవము లసాధారణములు. వారి పరస్పర ప్రేమానుబంధము లెట్టివో చిత్రపటసందర్శనసందర్భమునందే వ్యక్తములైనవి. ఐనను, పరిత్యాగము వలన నెంతయు నొచ్చియున్న సీతాహృదయమునకు ఆశ్వాసము కల్గించుటయు, నామె విషయమున రాముని హృదయ మెట్టిదో, ఆమెకు వ్యక్తమగునట్లు చేయుటయు,— ఈ ఘట్టములచే కవి సాధింపతలచిన ప్రయోజనములు. సీతపై రామునకు గల విశ్వాసమును, అనురాగమును, రామునిచే సమక్షమున చెప్పించుట కంటెను, పరోక్షమున చెప్పించుటయే సరసము, నౌచిత్యపోషకము నగుచున్నది. నిజముగ నన్యోన్యానురాగబద్ధు లగు దంపతు లొండొరులకు, తమ ప్రేమను గూర్చి వాచ్యముగ ప్రకటింపరు. అట్లు వ్యక్తముచేయుట అసహజము, ననుచితము నగును. నిజమగు ప్రేమ వియోగమునందే బాగుగ ప్రకాశింపగలదు. కావున సీతావిషయకమగు గాఢానురాగమును రాముడు ఆమెపరోక్షమున వ్యక్తము చేయుటయు, నందును నితరులకు చెప్పునట్లు గాక, తనలో తానే బాధచెందుచు వ్యక్తము చేయుటయు, నౌచితీపోషకములు. భవభూతి యీ విధానము నవలంబించియే సీతారాముల పరస్పరానురాగప్రాశస్త్యము నతి రమణీయముగ చిత్రించినాడు. సీతామనఃక్లేశమునకు ప్రధానకారణము రాము డామె నడవులకంపుటకాదు. వాస్తవపరిస్థితిని రాము డామెకు తెలిపి, అడవులకు పొమ్మని శాసించియుండినచో నామెమనస్సునకింతటి బాధ కలిగెడిదికాదు. రాజధర్మ మెట్టిదో యెఱుగనిదికాదు సీత. ప్రజారంజనము రాజునకు ప్రధానకర్తవ్యమని, వసిష్ఠుడు సందేశమంపగా, ధర్మపాలనమునందుత్సుకుడైన రాముడు, సీతనైన

పరిత్యజించుటకు తాను సిద్ధుడ'ని ఆవేశమున పల్కినాడు. ఆ సందర్భమున సీతయు రాముని ధర్మనిష్ఠకు హర్షించినది :—

" స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా ॥ "

అను రాముని వాక్యముపై —

" అత ఏవ రాఘవ ధురంధర ఆర్యపుత్రః " —

అని సీతాప్రశంస. రాముడు తన కేమియు తెలుపక తన్ను విడనాడుటచే నామె మనస్సు చివుక్కుమన్నది. కావున రాముని నిజభావమెట్టిదో సీతకు తెలియుట యావశ్యకము. అతనిభావము తెలియుట మాత్రమే చాలదు. అతని కీమెయందు గల యనురాగవైశిష్ట్యమును, నామె వియోగము వలన నత డనుభవించుచుండు మానసిక క్లేశము కూడ నామెకు ప్రత్యక్షగోచరమైనపుడే అవమానభరాక్లిన్నమగు సీతాహృదయము శిథిలము కాగలదు. రామునివిషయమున సీతాహృదయము కరుణ రసభరితము కావలసియున్నది. రాముని శోచనీయస్థితిని సీత కనులారకాంచిననే తప్ప, అది సాధ్యముగాదు. అట్టిపరిస్థితిని భవభూతి యిందు కల్పించినాడు. ఐనను సీతయెదుట, రాముడు తన మనోభావములను బాహాటముగ వ్యక్తపఱచుటగాని, శోకించుటగాని జరుగకూడదు. అది అనుచితము, నస్వాభావికము నగును. రాము డేకాంతమున తనలో తాను దుఃఖించునట్లు చేయుటయే యుచితవిధానము. రాము డేకాంతమున సీతను స్మరించుకొని వ్యథచెందునట్లును, అదృశ్యరూపమున రాముని గమనించుచుండిన సీత, అతని యవస్థను గాంచి, కరుణకు లోనగునట్లును, కవి అద్భుతమగు సన్నివేశమును కల్పించినాడు. రాముని యవస్థనుచూచిన సీత, తన యపవాదదుఃఖమును పూర్తిగ విస్మరించి అతని దుఃఖముతో తాను తాదాత్మ్యము నందినది. 'దురదృష్టవంతురాలగు తనకై భర్త యెంత విలపించుచున్నాడు', అని సీత వాపోయినది. 'రాముని మా వంక యెప్పుడైనది కదా' యనునెడి జంకు కూడ సీత కేర్పడినది. ఇదియే కవి యీఘట్టముచే సాధింపతలచిన విశిష్టప్రయోజనము. సీతారాములకు పునస్సమాగమము గూర్చుట కిది ప్రాతిపదిక. సీతాహృదయమున నాటిన అవమానశల్య మిట్లుద్ఘాటితమైనందున సీతారాముల హృదయపునస్సంయోగమున కవకాశ మేర్పడినది. భర్తృపరిత్యక్తయై, మారీచాశ్రమమున తపించుచుండిన శకుంతలకు దుష్యంతునితో పునస్సమాగమ మేర్పడినను, కాళిదాసు కథను పరిసమాప్తి యొనర్పలేదు. దుర్వాసశ్శాపవృత్తాంతమును గూర్చి మారీచమహర్షి

వివరించువరకును దుష్యంతుని పూర్వప్రవృత్తి శకుంతలకు బోధపడలేదు. భర్త ప్రవృత్తికి శాపము హేతువని తెలియుటతో హృదయము శాంతమై పూర్వస్థితికి వచ్చినది. కావుననే శకుంతలాదుష్యంతుల దాంపత్యజీవితము పావనమైనది. సీతారాముల పునస్సంయోగమును గూడ భవభూతి యీవిధానము ననుసరించియే సాధించినాడు.

ఈఘట్టమును నిర్వహించుటలో కవి ప్రదర్శించినభావనయు, కవితాశిల్పమును అనన్యసాధ్యములు. జనస్థానవనదేవతయగు వాసంతి, పూర్వము సీతారాములకు సఖి. వీరి వనవాసకాలముననే యీమెతో స్నేహానుబంధ మేర్పడినది. సీతకుగల్గిన యనర్థమును విన్నదాదిగా దుఃఖించుచున్న వాసంతి రామునిపై కోపగించుటలో నాశ్చర్యము లేదు.

"మహారాజా! కుమారలక్ష్మణునకు కుశలమా!" అని స్త్రీసహజమగు విధమున రాముడొనర్చినకార్యము నెత్తిపొడిచినది. శోకము నాపజాలక యేడ్చుచు 'దేవా! యేమి, క్రూరుడవై తివిగదా!' అని స్వాభిప్రాయమును వాచ్యమొనర్చినది. "కీర్తికాముడవై సీతకింతటి యన్యాయమొనర్చి నీవు సాధించిన యశ మెట్టిది?" అని అతడొనర్చిన కార్యమును విమర్శించినది. ఇంతకంటెను హృదయవిదారకమగు నవస్థ రామునకేది గలదు? సీతావిషయమున తానొనర్చినది క్రౌర్యమని రాము డెఱుగకపోలేదు. శంబూకవధోద్యోగమున రాముడు పల్కిన పల్కులే యిందులకు నిదర్శనములు.

రే హస్త! దక్షిణ! మృతస్య శిశోర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్.
రామస్య బాహురసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసన పటోః కరుణా కుతస్తే?

రాజధర్మనిర్వహణ మేవిధమున నీ కార్యములకు కారణమైనదో, యీ శ్లోకము వ్యక్తమొనర్చుచున్నది. తానొనర్చిన దారుణకర్మను తనపై ప్రీత్యభిమానములుగల యాప్తులు విమర్శించినపుడు హృదయమెట్లు బాధచెందునో వివరింప నవసరములేదు. కనుకనే సీత వాసంతియే క్రూరురాలని పల్కియున్నది. తాము తానొనర్చిన సీతాపరిత్యాగకార్యమును, స్త్రీపాత్రచే, - అందును దివ్యస్త్రీచే, - మరియును సీతారాములయెడ నధికాదరముగల వ్యక్తిచే, విమర్శింపబడునట్లు చేయుట భవభూతి ప్రౌఢిమాపోషకము.

సీతకుకల్గిన యవస్థను తలచి దుస్సహదుఃఖమునకు లోనగుట, శోకోద్వేగమున రాముని తూలనాడుట, దుఃఖవేగము నాపుకొనలేక పైకి నేడ్చి రాముడుకూడ నేడ్చునట్లు చేయుట అనునవి స్త్రీవిషయమునమాత్రమే సాధ్యములు. ఈ విషయమున భవభూతి యెంతయో జాగ్రత్తవహించినాడు. ద్వితీయాంకమున ప్రవేశించిన శంబూకుడుగాని, ఆఱవయంకమున రాముని కలిసికొనిన జనక వసిష్ఠ కౌసల్యాదులలో నెవ్వరుకాని రామునితో సీతా ప్రస్తావనయే కావింపకుండుట గమనింపనగును. వనదేవతయగు వాసంతివిషయము వేఱు. వనవాసమందు సీతారాములతో నామెకేర్పడిన స్నేహానుబంధము విశిష్టమైనది. స్నేహరూపమగు ప్రేమ సీతా రామలక్ష్మణులయం దామె కేర్పడినది. కావున రాముడొనర్చిన కార్యమును గూర్చి యామె ప్రశ్నించుటయు, విమర్శించుటయు, నిత్యాదులు యుక్తములగుచున్నవి. కోమలమగు స్త్రీహృదయమగుటచే తదాధారమున కరుణరసపోషణ గావించుటకు కవి కెక్కువ యవకాశము కల్గినది. రామునిహృదయమును మథించి, తదవస్థ నాధారముగా గొని కరుణరసమును పోషించుటలో కవి యవలంబించిన విధాన మద్భుతావహమైనది. దండకారణ్యవాసమున రాముడు పూర్వము సీతతో విహరించిన వివిధప్రదేశములు, సీత స్వయముగ పెంచిన వృక్షసంతతి, మున్నగువానిని వనదేవత రామునకు వేర్వేరుగా చూపి చెప్పుచున్నది. సీత పెంచిన నెమలియు, నేనుగు గున్నయు నిప్పుడు నిండు యౌవనమున విహరించుచున్నవి. సీత వానిని లాలించి పోషించినవిధాన మంతయు వాసంతి వర్ణించి, రామునకు ప్రత్యక్షమొనర్చుచున్నది. సీతారాముల పూర్వవృత్తాంత మంతయు వనదేవతహృదయమున చిత్రరూపమున నిలిచియుండుటచే తత్స్మరణము ఆమె కుల్లాసకరమే యగుచున్నది. కాని రాముని విషయమున కలిగిన పరిణామము విషాదకరమైనది. పండ్రెండేడులుగ రాముని హృదయకుహరమున కుములుచున్న సీతావియోగ దుఃఖాగ్నికి నీ దృశ్యములును, వాసంతి వాక్యములును, మారుతములై దానిని రగులుకొల్పినవి. తత్ఫలితముగ రాముడు సహజగాంభీర్యమునుగూడ కోల్పోయి తన్ను దా మఱచి యాక్రోశించుటయు, భావోద్వేగమున కాగజాలక, మూర్ఛిల్లుటయు జరిగినది. ఇంతకాలమునుండియు లోననే అణగి భరింపరానిదైయుండిన దుఃఖము బహిర్గతమగుట కవకాశమేర్పడినది. అట్లు కానిచో హృదయము భగ్నమగునని భవభూతి వాచ్యమొనర్చియే యున్నాడు.

"కర్తవ్యాని ఖలు దుఃఖితైర్దుఃఖ నిర్ధారణాని"—
'పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా
శోకక్షోభే చ హృదయం ప్రలాపై రవధార్యతే.'

అందును సీతారాముల ప్రణయగాథాసంబద్ధములగు విషయములను వాసంతి వాక్యములు స్పృశించుచుంటచే రామునిహృదయమునకు మఱింత వ్యథకల్గుచున్నది. సీతారాముల గోదావరీపరిసరవిహారములు, వారి ప్రణయకోపములు, అనునయములు మున్నగు సుకుమార విషయములను కవి వాసంతినోట పల్కించినాడు.

'అస్మిన్నేవ లతాగృహే త్వమభవస్తన్మార్గ దత్తేక్షణః
సా హంసైః కృత కౌతుకా చిరమభూద్గోదావరీసైకతే
ఆయాంత్యా పరిదుర్మనాయితమివ త్వాం వీక్ష్యబద్ధస్తయా
కాతర్యాదరవింద కుట్మలనిభో ముగ్ధప్రణామాంజలిః. '—

రాముని ప్రస్తుతావస్థనుబట్టి యీ వర్ణనమతనికి హృదయవిదారకమనుటకు నిక్కము. కావుననే దీనినంతయు చూచుచున్న సీత, వాసంతి కఠినాత్మురాలై రాముని క్షోభింపచేయుచున్నదని నిందించినది. ఈ వర్ణనము రామునకెట్లు బాధాకరమో, సీతకు నట్లే గదా!

ఈ దృశ్యాదులచే సీతారాము లిర్వురును భావోద్వేగమునకులోనై ఇతర ప్రపంచమునే మరచినారు. శోకోద్వేగమున కాగలేక రాముడు మూర్ఛితుడైనాడు. సీతాకరస్పర్శచే నతడు చైతన్యవంతుడగునని, యందులకు తమస సీతను ప్రోత్సహించినది. నిజభర్తృరక్షణార్థమై సీత యతనిని స్పృశించుట, రాముడు చైతన్యవంతుడై తత్స్పర్శ సీతాస్పర్శగా గుర్తించుట, ననునవి కవి గావించిన యద్భుత కల్పనలు. అనన్యసాధారణమగు సీతారాముల పరస్పరానురాగమునకు, ఈ హస్త స్పర్శవృత్తాంతము విశిష్టనిదర్శనము. తత్స్పర్శచే రామునియందు దైహికముగను, మానసికముగను గల్గిన పరిణామమెట్టిదో కవి యత్యద్భుతముగా చిత్రించియున్నాడు.

'ఆలిమ్పన్నమృతమయైరివ ప్రలేపై
రన్తర్వా బహిరపి వా శరీరధాతూన్
సంస్పర్శః పునరపి జీవయన్నకస్మా
దానందపరమి వాదధాతిమోహం॥'

అని రామునిచే కవి పలికించియున్నాడు. పాణిగ్రహణసమయమున గల్గిన సీతా హస్తస్పర్శానుభూతి రామునిజీవితమున శాశ్వతముగ నిలిచిపోయినది. సీతయందు రామునకు గల విశిష్టానురాగబంధము, ఈ యనుభూతిని వివిధవిధముల వికసింప చేసి యితని జీవితమున దీనిని ద్వితీయప్రకృతిగా నొనర్చినది. వివాహకంకణా లంకృతమును, అమృతసూతి కిరణసదృశమును నగు నా నూతనసీతావధూ హస్త స్పర్శ తనకు చిరపరిచితమైనదనియు, కనుక తా నిపుడు గుర్తింపగల్గితిననియు, రాముడు వాసంతితో బల్కినాడు. తృతీయాంకమందు తా కల్పింపబోవు నీ ఘట్ట మును మనసునందుంచుకొనియే కవి, ప్రథమాంకకథయందే సీతాస్పర్శవిషయమును ప్రశంసించినాడు. ఈ ఘట్టమువలన సీతామనశ్శల్యము తొలగింపబడినది; తనపై రామునకుగల గాఢానురాగము వ్యక్తమైనది. స్వర్ణమయ సీతారూపవిగ్రహమే ద్వితీయగ, రాముడు అశ్వమేధమునకు దొడంగెనని రామునిచేతనే కవి పల్కించి యుండుటచేత, సీతపై రామునకు గల గౌరవముగూడ విదితమైనది. కావుననే "అహో ! ఉత్ఖాతితమిదానీం మే పరిత్యాగశల్య మార్యపుత్రేణ"—అని సీత పలికినది. ఇట్లీ ద్వితీయ తృతీయాంకములచే కవి, కడపట జరుగబోవు నాయికానాయకుల పునస్సమాగమమునకు ననుకూలమగు పరిస్థితి నేర్పరచినాడు. సీతారాముల విరహ శోకావస్థను, రసోత్కటముగ చిత్రించి యీ యనర్థమున కంతకును మూలమగు ప్రజాపవాదపరిణామమును ప్రత్యక్షీకరించినాడు. రాముని ధర్మైకనిరతికిని, తద్రక్షణ మునకై యతడొనర్చిన యారంభమునకును, ప్రథమాంకేతివృత్తము స్థానమైనది. నిజధర్మరక్షణప్రయత్నమున తనకెట్టి వ్యథ కల్గుచున్నను, తానెట్లు సుస్థిరుడై ధర్మ పాలనకు ప్రయత్నించుచున్నదియు, ద్వితీయ తృతీయాంకగతమగు నీ రెండవఘట్ట మున చిత్రితము. శోకాతురుడై మూర్ఛనొందిన రాముని స్పృశించి, యతనిని చైతన్యవంతు నొనర్పుమని తమస సీత నాదేశించినపుడు సీత, రాజశాసనమునకు విరుద్ధముగ ప్రవర్తించుటెట్లా యని శంకించినది. నాయికానాయకు లిర్వురును నిట్లు ధర్మపాలనకై తమ జీవితసౌఖ్యమును త్యాగమొనర్చుచుండుట యిందు వ్యక్తము. ఇట్లు ప్రథమాంకేతివృత్తము ముఖసంధియు, ద్వితీయ తృతీయాంక కథాభాగము ప్రతిముఖసంధియు నగుచున్నవి.

వసిష్ఠారుంధతీ పురస్సరులగు కౌసల్యాదులు వాల్మీకి యాశ్రమమునకు వచ్చు టయు, నందు జనకుని చూచుటయు, నను కథాభాగములచే చతుర్థాంక మారంభము. ఇందును ధర్మప్రశంసగలదు. సీతకు రామునివలన జరిగిన యన్యాయము కారణ

ముగ కౌసల్యాదులు జనకుని దర్శింపలేకున్నారు. పుత్త్రికాదుఃఖముచే పరితపించు చున్న జనకునోదార్చుట కౌసల్యధర్మమని గురుని యాదేశము. పుత్త్రికకు జరిగిన యవమానమును స్మరించి మొదట జనకుడు కుపితుడైనను, అరుంధతీప్రార్థనచే శాంతుడై, రాముని రాజధర్మనిరతి నర్థముచేసికొన్నాడు. ఈ ఘట్టముననే వృద్ధ జనులు లవుని చూచుటయు, వానియందు గోచరములగు సీతారూపరేఖాదులను కాంచి ముగ్ధులగుటయు, జరుగును. ఇంతలో యజ్ఞాశ్వము వచ్చుట, చంద్రకేతు ప్రశంస, కూర్పబడినవి. లవ చంద్రకేతువుల యుద్ధకథతో నైదవయంకము కూర్ప బడినది. ఈయుద్ధఘట్టమున గూడ ధర్మప్రశంస కలదు. రథస్థుడైయున్న చంద్ర కేతువు పాదచారియగు లవునితో పోర నొల్లక యుద్ధధర్మమునుగూర్చి సుమంత్రుని ప్రశ్నించుటయు, నతడు ధర్మము తెలుపుటయు నిందనుసంధేయములు. పరస్ప రావలోకనమువలననే లవ చంద్రకేతువుల కొకవిధమగు పరస్పరస్నేహ మేర్పడినది. అన్నదమ్ములని తెలియకుండియు నిట్లు గల్గిన యనుబంధము ప్రకృతిసహజమని కవి వ్యక్తపరచినాడు. లవుడొనర్చిన జృంభకాస్త్రప్రయోగముచే, నా బాలుడు సీతా సంతానమైయుండునేమో యనెడు నొక సంశయము సుమంత్రునకు కల్గినది. ఇట్లీ కథాభాగము నాయకునిచే నారబ్ధమైన ధర్మపాలనమనెడు విషయమును పోషించుచు సీతావిషయక పునస్సమాగమమునకు ప్రత్యాశను కూడ సూచించుచు నాటకరచన యందు గర్భసంధి యగుచున్నది.

జనస్థానమునుండి అయోధ్యకు విమానములో పోవుచుండిన రాముడు లవ చంద్రకేతువులను చూచి, విమానమునుండి దిగి, యుద్ధము నాపుటతో నాఱవయంక మారంభము. కుశలవులతో సమాగమమేర్పడుట, వారియందు రామునకు వాత్సల్య ముదయించుటయు, వారికిని నట్లే రామునందు పితృగౌరవము గల్గుటయు, — ఇత్యాదులను కవి హృదయంగమముగ చిత్రించి, మానవమనస్తత్త్వ మెట్టిదో ప్రదర్శించినాడు. కుశలవులయందు సీతారూపరేఖలు రామునకు స్పష్టముగ గోచర మైనవి. బాలకుల వయస్సునుబట్టియు, వీరికి జన్మతః సిద్ధించిన జృంభకాస్త్ర రహస్యములను బట్టియు, నితరకారణములను బట్టియు, వీరు సీతాకుమారులని, రాముడు శంకించునట్లు కథాసంవిధానము పోషితమైయున్నది. ఈ కుమారప్రత్యభి జ్ఞానఘట్టము సీతాపునస్సమాగమమునకు సాధకమగుచు, ధర్మమెల్లవిధముల రక్షిత మగునని నియతమొనర్చుచుండుటచే నాటకరచనయందు అవమర్శసంధి యగు చున్నది.

మూలకథలో లేని యుద్ధవిషయమును కవి కల్పించినాడు. పద్మపురాణ మందును, జైమినీభారతమందునుగల కథ ననుసరించినాడు భవభూతి. కాని వాని యందున్న విధమున పినతండ్రులతో కుమారులకు యుద్ధము కల్పించుట, అనుచిత మని భవభూతి యెంచి, లక్ష్మణకుమారుడగు చంద్రకేతువుతో లవునకు యుద్ధమును కూర్చినాడు. ఈ మార్పు సరసము నుచితమునై యున్నది. లవుని విషయమై ప్రశ్నించిన జనకాదులతో వాల్మీకి "అంతయును మీరు సమయమున నెఱింగెదరు", అని చెప్పియుండుట కూడ సీతారామపునస్సమాగమమును సూచించుచున్నది. వాల్మీకిచే రచితమై, భరతమునిచే ప్రదర్శింపబడిన, అంతర్నాటికతో సప్తమాంకము కూర్పబడి యున్నది. సకలపౌరజానపదసమక్షమునను, శ్రీరామలక్ష్మణాదుల సమక్షమునను, నీ నాటిక ప్రదర్శితమగుటలో విశిష్టమగు నుద్దేశము కలదు. పరిత్యాగానంతరము, జరిగిన సీతాజీవితవృత్తాంతమును, ఈ నాటకప్రదర్శనము రామాదులకు తెలిపి వారి కాశ్వాసమొసంగినది. పృథ్వీభాగీరథులు స్వయముగ సీతను రక్షించుట, సీతాసంబంధమున "మేము పునీతులమైతి" మని పల్కుట, వారే ప్రత్యక్షమై రామునకు సీతనొప్పగించుట, మున్నగు దివ్యాద్భుతసంఘటనల వలన సీతామాహాత్మ్య పావిత్ర్యములు జగద్విదితములైనవి. అపవాదమునకు కారకులైన పౌరులు సిగ్గుపడి అధోముఖులైనారు. జృంభకాస్త్రాధిదేవతలు ప్రత్యక్షమగుటచే సీతారాముల దివ్యత్వము, ప్రజలకు దృగ్గోచరమైనది. సీతాపవాదము నిరస్తమై, ఆమె పావిత్ర్యమును, రాముని ధర్మనిష్ఠయు, లోకమునకు వ్యక్తములైనవి. ఈ యంతర్నాటిక కల్పనచే కవి యీ విధమున నుద్దిష్టప్రయోజనమును సాధించినాడు. ధర్మనిర్వహణపథమునందు రామునకేర్పడిన అపవాదమూలకమగు సీతావియోగ మును తొలగించి ఉద్దిష్టమగు ధర్మప్రయోజనమును సాధించుటకు ఇంతకంటెను సరసమగు విధానము కానరాదు. రాముడు ధర్మవీరుడు. పుత్త్రధర్మ, క్షాత్రధర్మ, భ్రాతృధర్మాదుల నిదివఱకే పాలించినవాడు. రాజ్యాభిషేకానంతరము రాజధర్మ మును, నిష్కళంకముగ మనఃపూర్వకముగ పాలింప నుత్సహించినవాడు. అట్టివా నికి సతీవియోగమనెడు బలవత్తరమగు నాటంకము ధర్మమార్గమునందేర్పడినది. దానిని తొలగించి ధర్మపాలనము సుకరమగునట్లు సాధించుట యందు ప్రధాన ప్రయోజనము. నాయికానాయకు లనుభవించిన వియోగవ్యథయంతయు, తద్ధర్మ పాలన ప్రయోజనమున కుదాత్తత గల్పించినది. నాటకాంతమున నాయకుడు మంగళము నాశించుచు—'పాప్మభ్యశ్చ పునాతు వర్ధయతు చ శ్రేయాంసి సేయం కథా' అని పలికి అపవాదరూపమగు పాపము నశించి ధర్మమున కాస్కారము కల్గుటచే

లోకమునకు శ్రేయస్సు కల్గునని నిర్దేశించినాడు. నాయకుడు సాధింపతలచిన ఉదాత్త ప్రయోజనము ధర్మమని యిట్లు నిశ్చితమగుచున్నది. ఈప్రయోజనమును బట్టియే నాటకమున పోషితమైన ప్రధానరసమేదియో నిర్ణయింపవలసియుండును.

నాటకము నందాదినుండియు తుదివఱకును స్థూలదృష్టికి ప్రత్యక్షమగుచుండునది కరుణరసము. చిత్రపటసందర్శన ఘట్టము నుండియుకూడ కవి కరుణ నభిమాన రసముగ పోషించుచువచ్చినాడనుటలో సందేహము లేదు. ఈ రసపోషణకు తృతీయాంక మాయువుపట్టని యింతకుపూర్వమే వివరింపబడినది. రామకుశలవుల సమాగమమందును, సీతారాముల పునస్సమాగమసందర్భము నందును గూడ కరుణ రసపోషణకు కవి అవకాశము గల్పించినాడు. ఇట్లు కరుణరసపోషణకు నాటకము నందుగల ప్రాబల్యమునుబట్టి కరుణయే అంగిరసమనెడు నభిప్రాయమేర్పడినది. ప్రాచీనులు గూడ పల్వురిందలి ప్రధానరసము కరుణమనియే ఊహించినారు. కాని విమర్శించిచూచినచో కరుణము ప్రధానరసముకాదని వ్యక్తముకాకపోదు. నాయకుడు సాధింపతలచిన మహాప్రయోజనమును బట్టి అంగిరసము నిర్ణయముకావలెను. నాయకుడిందు సాధింపతలచినది ఉదాత్తమగు ధర్మము. ప్రజారంజనార్థమై యెద్దానినైనను, తుదకు తన బహిఃప్రాణమగు సీతనైనను త్యాగముచేయుటకు తానుద్యుక్తుడని రాము డారంభమునందే ప్రతిజ్ఞయొనర్చినాడు. స్వధర్మపాలనము రఘువంశీయుల కర్తవ్యమని వసిష్ఠుడంపిన సందేశము రాముని సహజోత్సాహమును ద్విగుణీకృతమొనర్చినది. రాముని యీ నిశ్చయమును సీతయు నపుడే ఆమోదించినది. ఇక, నాటకారంభమునకు పూర్వమే ప్రస్తావనయందుకూడ సూత్రధారునిచే ధర్మప్రశంస కవి చేయించియుండుట గమనింపవచ్చును. స్వధర్మము సర్వథా వ్యవహర్తవ్యమనియు, ఇతరుల దూషణాదులను పరకుగొనరాదనియు, సూత్రధార వాక్యము. మఱియు కథారంభమందలి రాముని వాక్యమే నాటకప్రయోజనమును నిర్ణయించునదియై యున్నది. "కిం త్వనుష్ఠాననిత్యత్వం స్వాతంత్ర్యమపకర్షతి" అను వాక్యముచే వ్యక్తిస్వేచ్ఛను ధర్మనిష్ఠ యెట్లు అరికట్టుచున్నదో వ్యక్తమొనర్పబడినది. రాముడొనర్పవలసిన కర్తవ్యము, ఆతని వ్యక్తిస్వాతంత్ర్యమునకు ప్రతిబంధకమైనది. కావుననే సీత పరమసాధ్వియని యెఱింగియు, ఆమెవిషయమున తనకు గల భర్తృధర్మమును గుర్తించియుకూడ, అంతకంటెను విస్తృతమగు రాజధర్మమును పాలించుటకై రాముడు స్వార్థమును త్యాగమొనర్చినాడు.

కవి యిట్లు నాటకారంభమందలి నాయకుని ప్రథమవాక్యమునందే నాటక ప్రయోజనమును సూచింపచేసియున్నాడు. పూర్ణగర్భిణియగు సీతను గృహమున విడిచి కౌసల్యాదులు ఋష్యశృంగాశ్రమమునకు పోవుటకు గూడ ధర్మపాలనమే కారణము. లోకకల్యాణ ముద్దిష్టముగ నిర్వహింపబడు యజ్ఞమనెడి ధర్మము స్వకార్యముకంటెను నుత్తమమైనది గనుక కౌసల్యాదులును, అరుంధతీవసిష్ఠులును, ఋష్యశృంగాశ్రమమునకు పోవలసివచ్చినది. వారు సీతకంపిన సందేశమే యీ విషయమును వ్యక్తముచేయుచున్నది. "లోకారాధనమునందు జానకినైనను త్యాగముచేయుటకు నేను వ్యథనొందను" అనెడి రామునివాక్యమునందే బీజ మిమిడి యున్నది. కావున ధర్మపాలనము నాయకుని ప్రయోజనమనుటలో విప్రతిపత్తి లేదుగదా! మఱియు, చిత్రపటసందర్శనసందర్భమున, అరణ్యావాసగమనమునకై సిద్ధులై యున్న సీతారాముల పటమును చూపి లక్ష్మణుడు, 'రఘువంశీయులే యారణ్యకవ్రతమును వృద్ధాప్యమున నవలంబించిరో, దానిని రాముడు బాల్యముననే అవలంబించినా'డని పలికి, రాముని ధర్మదీక్షను ప్రశంసించినాడు. దుర్ముఖుని వలన నపవాదవృత్తాంతమును వినిన రాముడు, సీతావిషయమున తానెట్లు ప్రవర్తింప వలెనో యనెడి పరితాపమునకు లోనై,

"సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం పరమ్,
తత్ప్రతీతం హి తాతేన మాంచ ప్రాణాంశ్చ ముంచతా."

అను వాక్యమున, లోకారాధనమే సత్పురుషుల ధర్మమనియు, దాని పాలించుట యందే తన తండ్రియగు దశరథుడు ప్రియపుత్త్రుని కోల్పోయి ప్రాణములను గూడ త్యజించెననియు పలికినాడు. రఘువంశీయులు ధర్మనిష్ఠకలవారగుటచేతనే,

"ఇక్ష్వాకువంశోఽభిమతః ప్రజానామ్"

అని రాముడభిప్రాయ మిచ్చియున్నాడు. కావుననే తానును నాత్మసౌఖ్యత్యాగము గావించి ధర్మమును పాలింపవలెననునది రాముని నిశ్చయము. ఐన, అగ్నిసాక్షిగ వివాహమాడి, బాల్యమాదిగ ప్రేమించిన సతిని విడనాడుట అధర్మముగాదా? యనెడు ప్రశ్న రామునకు కలుగకపోలేదు. కాని తనకును తన సతికినిమాత్రమే సంబంధించిన ధర్మమునకంటెను లోకమునకు సంబంధించిన విస్తృతధర్మమును పాలించుట రాజు కర్తవ్యమగుటచే రాముడు సీతాత్యాగమునకు నిశ్చయించినాడు. భిన్నధర్మములతో గూడిన సంఘటన లెదుర్కొనినపుడు మానవునకు విషమసమస్య యేర్పడుచున్నది. ఆయా వ్యక్తుల యాదర్శములను, శీలమును, జ్ఞానమును బట్టి

వానిలో నే ధర్మము పాలనీయమనెడి విషయము నిర్ణయమగుచున్నది. 'Les Miserables' అను ప్రసిద్ధమగు ఫరాసు నవలలో, ధర్మనిర్వహణము నందొక రక్షకశాఖోద్యోగి నిట్టి విషమసమస్య యెదుర్కొన్నది. ఒకచో తన జీవితమును రక్షించిన వ్యక్తియెడ తాను చూపవలసిన కృతజ్ఞతాధర్మము, మఱి యొక వైపున తాను పాలింపవలసిన యుద్యోగధర్మము,— అను నీ రెంటిలో నేది పాలనీయమో నిర్ణయించుకొనలేక అతడాత్మహత్యకు పాల్పడినాడు. ధర్మ తారతమ్యవిషయమున నిదమిత్థజ్ఞానము చాలని వ్యక్తినిర్ణయమిది. ముద్రారాక్షసమున మంత్రిరాక్షసునకు గూడ నిట్టి యవస్థయే యేర్పడినది. చందనదాసును రక్షించి మిత్రధర్మమును పాలించుటయే యుత్తమమని పండితుడగు రాక్షసుడు నిర్ణయించినాడు. సిద్ధార్థు డొనర్చిన మహాత్యాగము కూడ నిట్టిదే! తన్ను కని పెంచిన తలిదండ్రులను, ప్రేమించిన సతీసుతులను, రాజ్యసౌఖ్యములను సిద్ధార్థుడు త్యజించినాడు. లోక కల్యాణమునకై జీవితతత్త్వాన్వేషణము గావించుటయే పరమధర్మమని నిర్ణయించిన సిద్ధార్థునకు, పుత్త్రధర్మ, భర్తృధర్మ, రాజధర్మాదులు అప్రధానములుగ దోచినవి. ఇట్టి విషమసమస్యలను పరిష్కరించుకొనుటయందే వ్యక్తిశీలము నిర్ణయమగును. భర్తృధర్మ రాజధర్మములలో రాజధర్మమే విస్తృతము ప్రధానము నైనదని రాముడు నిర్ణయించి, ఆత్మసౌఖ్యత్యాగమొనర్చి తన ఉదాత్తతను ప్రదర్శించినాడు.

ద్వితీయాంకమునకు మొదటనుండు విష్కంభమున సీతాపరిత్యాగ విషయమును గూర్చి ఆత్రేయివలన వాసంతి యెఱిగినది. అట్లు రాముడు సీతను త్యజించియు, అశ్వమేధయాగమును నిర్వహించుచు, బంగారపు సీతాప్రతిమను యజ్ఞ నిర్వహణమున సహధర్మచారిణిగా నిడుకొనెనని విన్న వాసంతికి, రాముని ధర్మ పరత్వమును, గొప్పదనమును వ్యక్తములైనవి.

" లోకోత్తరాణాం చేతాంసికో హి విజ్ఞాతు మర్హతి ? "

(లోకోత్తరులైనవారి హృదయములను తెలిసికొనుట యెవరికి సాధ్యము ?)

అని పల్కినది. ఇందును రాముని ధర్మప్రశంసయే కలదు. శంబూకవధవిషయమున కూడ రాముడు రాజ్యధర్మమునే పాటించినాడు. ఈవిషయమునగూడ నతని నెదుర్కొన్నది విషమసమస్యయే! రాముని స్వకీయాభిప్రాయమునుబట్టి శంబూకు డొనర్చినది తప్పుకాదు. కాని నాటి ధర్మశాసనదృష్టిలో శంబూకునిది అధర్మప్రవృత్తి. ధర్మశాసనమును ప్రవర్తింపజేయవలసిన బాధ్యత రాజగు రామునిపైగలదు. కనుక రాముడు రాజధర్మమును పాలింపక తప్పినదికాదు. కావుననే శంబూకునిపై

ఖడ్గమును ప్రయోగింపబోవుచు, రాముడు తానొనర్చుచున్న కార్యమెట్లు ప్రకారమైనదో వ్యక్తమొనర్చియే యున్నాడు. ఇందును రాముని ధర్మదీక్ష స్పష్టముగ వ్యక్తమైయున్నది.

రామునిచే ననుజ్ఞాతుడై పుణ్యలోకముల గూర్చి పోవు శంబూకుడు గూడ, "పురాణబ్రహ్మర్షియగు నగస్త్యునకు ముందుగా నమస్కరించి, పిమ్మట శాశ్వతమగు పదవినిగూర్చి పోయెద" నని పల్కి ధర్మప్రవృత్తి యెట్టిదో సూచించినాడు. తనకు ప్రియమగు జనస్థానమును బ్రవేశింపబోవుచు, రాముడుకూడ అగస్త్యభగవానుల ఆదేశమును ముందుగ పాటించియుండుట గమనింపదగినది. జనస్థానమందలి పరిచితప్రదేశముల దర్శనముచే వినోదము నొందుట కుత్సుకుడైయున్నను, రాముడిట్లు గురుజనాదేశమునకు గౌరవమొసగియున్నాడు. ఇట్టి ధర్మప్రవృత్తిని నాటకమునందనేక సందర్భములలో కవి ప్రత్యక్షమొనర్చినాడు. జనస్థానమందలి పూర్వపరిచితదృశ్యములచే సీతావియోగదుఃఖ ముత్కటముకాగా, రాముడు పరితపించుచు పౌరులనుగూర్చి యనుకొన్న వాక్యములును ఇందనుసంధించుచున్నవి.

> "న ఖలు భవతాం స్థానం దేవ్యా గృహేఽభిమతం తత
> స్తృణ మివ వనే శూన్యే త్యక్తా న చాప్యనుశోచితా
> చిరపరిచితా స్తే భావా స్తథా ద్రవయంతి మామ్
> ఇదమశరణై రద్యా ప్యేనం ప్రసీదత రుద్యతే" ॥

సీతయునికి పరుల కయిష్టమగుటచే నామెను తృణమువలె పరిత్యజించినాడు. ఇంతవఱకును బాహాటముగ నేడ్చినవాడుకాడు. ప్రజారంజనము కొఱకు భార్యను విడిచియు, రాముడు దుఃఖించుచో నతడు మనఃపూర్వకముగా సీతాపరిత్యాగము గావింపలేదను భావము పౌరులలో కలుగును. రాముని శీలమును శంకించుటకిది యవకాశ మొసగగలదు. కావుననే శూన్యమగు వనమున సీతను తృణమువలె త్యజించియు, ప్రజలకు రాముడు తన దుఃఖమును తెలియనీయలేదు. (నాప్యనుశోచితా) కాని, చిరపరిచితములగు జనస్థానదృశ్యముల దర్శనమువలన కల్గిన ఆ యా భావములు రాముని హృదయమును కలంచి, విలపించునట్లు చేయుచున్నవి. "దిక్కులేక యేడ్చెడి నా విషయమున సహనము చూపవలెను." అని పౌరులను ప్రార్థించుచున్నాడు, రాముడు. రాజధర్మమును పాలించుటలో నాయకుడెంతటి యాత్మత్యాగమును గావించియున్నాడో యిందువలన సువ్యక్తమగుచున్నది. లవ చంద్రకేతువుల యుద్ధసమయమున చంద్రకేతువు యుద్ధధర్మమును గూర్చి యెట్లు

సుమంత్రుని ప్రశ్నించియుండుటయు, నిదివఱకే వివరింపబడినది. సప్తమాంకమున దివ్యములు నద్భుతములు నగు సంఘటనలచే పౌరజానపదులెల్లరును, సీతాదేవి పావిత్ర్యదివ్యత్వములను గుర్తించి యామెకు ప్రణమిల్లునంతవఱకును, రాముడామెను పరిగ్రహింపలేదు. రాముని ధర్మనిర్వహణదీక్ష అట్టిది. ఆ సందర్భమున అరుంధతి పల్కినవాక్య మిందనుసంధేయము.

'నియోజయ యథా ధర్మం ప్రియాం త్వం ధర్మచారిణీమ్' —

(నీయందు ప్రీతియుక్తురాలును, ధర్మచారిణియు నగు సీతను ధర్మము ననుసరించి యజ్ఞకర్మమునందు నియోగింపుము.) — అని అరుంధతి యాదేశము. లోకహితమునుద్దేశించి నిర్వహింపబడునది యజ్ఞము. దానికి ధర్మము మూలము, సీత, ధర్మచారిణి; రామునియందు గాఢానురక్త. సీతలేనిచో రాముడు ధర్మమును సక్రమముగ నిర్వహింపచాలడు. కావున ధర్మచారిణియగు సీతను సహధర్మచారిణిగ నియమించుకొని ధర్మమును రాముడు పాలింపవలయుననుట గురువులయాశయము. సీతాపునస్సమాగమముచే నిట్లు ధర్మపరిపాలనమునందు మఱల రాముడు సమర్థుడగుచున్నాడు. ఈవిధమున నాయకుడు సాధించిన ప్రయోజనము స్వధర్మమని నిర్ణయమగుచున్నది. ధర్మనిర్వహణమునందు నాయకుడు ప్రదర్శించిన యుత్సాహమే ప్రధానరసమునకు మూలము. కావున, ఉత్సాహము స్థాయిభావమగుటచే వీరము — అంగిరసము. నాయకుని ఉత్సాహము ధర్మపరిపాలనాసంబద్ధమగుటచే ధర్మవీరము అంగి.

'వీరశ్చతుర్ధా-దానదయాయుద్ధధర్మైః —
తదుపాధే ఉత్సాహస్య చతుర్విధత్వాత్'—

ఇట్లు ఉత్సాహము చతుర్విధమనియు, వానిననుసరించి వీరము చతుర్విధమనియు, నందు ధర్మవీరమొకటి యనియు, రసగంగాధరకారుడు స్పష్టముచేసియున్నాడు. ఆలంకారికులెల్లరును నంగీకరించినవిషయమగుటచే దీనిని విపులీకరింపనవసరములేదు. ధర్మప్రయోజనమును సాధించుటలో నాయకునికి సతీవియోగమనెడి ప్రతిబంధకమేర్పడినది. ధీరుడు నుదాత్తుడు నగుటచే నాత్మసౌఖ్యమును వియోగదుఃఖమును అధిగమించుచు ధర్మపరిపాలనమునందు నాయకుడు సుస్థిరుడైనాడు. విధివిలాసమునకు నాయికానాయకు లిర్వురును, తలయొగ్గినారు. ఆదియందు ప్రబలమైయుండిన యధర్మము కాలక్రమమున దుర్బలమగుచువచ్చుటయు, పరిస్థితులప్రాబల్యముచే తాత్కాలికముగ నడగియుండినట్టి ధర్మము మఱల వికాసము

నొందుటయు జరిగినది. పూజ్యులగు గురుజనులును, ధర్మనిష్ఠాపరులగు మహర్షులును, భగవదంశసంభూతులగు దివ్యులును, రక్షకులై నిలువ, ధర్మము విజయము గాంచినది. ధర్మపరిపాలనకు ప్రతిబంధకముగ నేర్పడిన వియోగ మాధారముగ నాయికా నాయకులయందు కరుణము పోషించుటకు అవకాశమేర్పడినది. ఇట్లు అంగియగు ధర్మవీరమునకు కరుణము ప్రధానమైయున్నది. అంగియగు ధర్మవీరమును గర్భితముగ నొనర్చి కరుణమును ప్రత్యక్షముగను ఉత్కటముగను కవి పోషించియుండుటచే, కరుణమే అంగిరసమనెడు నపోహ కవకాశమేర్పడినది. కాని, కరుణమునకు శోకము స్థాయిభావము గదా ? ధర్మపరిపాలనమునందు నాయకునకుగల యుత్సాహమునకును, శోకమునకును సంబంధము కుదురుటెట్లు ? సీతాపరిత్యాగానంతరముననేకాని శోకమున కాస్కారములేదు. ప్రథమాంకారంభమున, సీతాద్వితీయుడై యుండియే రాముడు ధర్మప్రయోజనమును సాధింప నిశ్చయించినాడు. కావున, నాయకుని ఆరంభమునకు శోకభావముతో సంబంధము కుదురదు. నాయకుడొనర్చిన అరంభమునకు తర్వాత, ప్రయోజనసిద్ధికి భంగకరముగా నేర్పడినది వియోగవిషయము. తద్వియోగముననుసరించి వచ్చినదియే శోకము. కావున తత్పర్యవసానమగు కరుణ మప్రధానముకాక తప్పదు.

కరుణమును ప్రధానముగ చెప్పవలసివచ్చినచో నాటకారంభమే భిన్నమైయుండవలయును. నాటకారంభమునకు పూర్వమే సీతావియోగ మేర్పడియుండెనేని, సీతాపునస్సమాగమ మనెడు విషయము ప్రయోజనమనియు, నాయికానాయకు లనుభవించెడిది శోకమనియు, తత్కారణమున రసము కరుణమనియు, చెప్పవచ్చును. ఒకవేళ అట్లుచెప్పినను, నాయకుడు సాధింపనుద్దేశించు ప్రయత్నమెట్టిదో తెలియదు గదా ! ప్రజారంజనార్థమై ఉద్దేశపూర్వకముగ, త్యజించిన సీతను మఱల తెచ్చుకొనుటకై రాముడు ప్రయత్నమొనర్చుచున్నాడనుట పొసగదు గదా ! కనుక కరుణమునకు ప్రాధాన్యము నంగీకరించుచో, నాయకుడు సాధింప దొరకొను ప్రయోజనమెద్దియో కనపడదు. శోకానుభూతినే సాధింప తలచుకొన్నాడనుట పొసగదు. అవియన్నియు నట్లుండ, సీతావియోగము నాటకారంభమునకు తర్వాత జరిగినవిషయమేగాని, తత్పూర్వము జరిగినవిషయము కాకుండుటచే, నిట్టివాదమున కాధారములేదు. ధర్మమునే సాధించుటయే నాయకుని ప్రయోజనమనియు, తదాధారమగు నుత్సాహమే ధర్మవీరముగ పర్యవసితమగుచున్నదనియు, నంగీకరింపక తప్పదు.

ఇక, కరుణవిప్రలంభ మిందు ప్రధానరసమనెడి మఱియొక వాదము కలదు. కరుణాత్మకమైన విప్రలంభభేదము కరుణవిప్రలంభము. కావున శృంగారరసభేద

ములలో నిదియు నొకటి. నాయికానాయకులకు బలవత్తరములగు కారణములచే తాత్కాలికమగు నెడబాటు కలుగగా, వారు వియోగతప్తులై యనుభవించు శోకము దీని కాధారము. వియోగమున కవధియున్నదనియు, మఱల నాయికానాయకులు కలిసికొందురనియు నాశయున్నప్పుడే కరుణవిప్రలంభమున కవకాశమున్నది. ఈ ప్రత్యాశ నాయికానాయకులకు తప్పక యుండితీరవలెను. నాయికానాయకు లొండొరులను స్మరించుకొని, రతిభావమునకు లోనై యనుభవించు వ్యథ ప్రత్యాశా సహితమై యున్నప్పుడే కరుణవిప్రలంభము కాగలదు. ప్రత్యాశలేనిచో శృంగార మున కవకాశమే యుండదు. మేఘసందేశమున యక్షునియవస్థ ప్రత్యాశతోగూడిన దగుటచే నందు కరుణాత్మకములగు వర్ణనలు కరుణవిప్రలంభపోషకములు. కాదంబరియందలి మహాశ్వేతావృత్తాంతమును నిట్టిదే। ఉత్తరరామచరిత్రయందలి నాయికానాయకుల పరిస్థితి వేఱు. రామునకుగాని, సీతకుగాని, పునస్సమాగమ ప్రత్యాశయున్నదని చెప్పుటకు వీలులేదు. కీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిగా రీ విషయమును చర్చించుచు, ప్రత్యాశను నిర్ణయించునవిగా నుదహరించిన వాక్య ములు విమర్శనీయములు. "నీవు వీరప్రసవ వవుదువుగాక!" అని వసిష్ఠుడు సీత కంపిన ఆసీస్సుపై రాముడు, 'మహర్షుల వాక్యములు తప్పనివి' అని వ్యాఖ్యానించి యున్నాడు. సీతాపునస్సమాగమవిషయమగు ప్రత్యాశ రామునకు కలదనుట కిది నిదర్శనమని శాస్త్రిగారి యూహ. గర్భిణియైయున్న సీతకు వసిష్ఠుడట్టి సందేశమును పంపుటయు, గురుని ఆశీస్సును పూజ్యభావమున రాముడు గ్రహించుటయు, నిత్యాదులు సాధారణలోకవిషయములు. గురునివాక్యముల నాధారముగ చేసికొనియే యుండినచో రాము డంతటి యుత్కట శోకమునకు పాల్పడవలసిన యవసరమే యుండదు. గురుని యాశీస్సు తప్పక ఫలించునని రాముడు నమ్మవచ్చును. కాని ఆమెను మఱల కలిసికొందునని ప్రత్యాశయెక్కడిది? పుత్త్రజననముతో ప్రజాపవాదము నశించుననియు, నంతతో సీతను మఱల గ్రహింపవచ్చుననియు, రాముడు తలంచెనా? అట్లయినచో రాముడు, సీతను కానలకంపినది తాత్కాలిక ముగనే యనియు, ప్రజల నప్పటికెట్లో తృప్తిపఱచుటకు ప్రయత్నించెననియు చెప్పవలసివచ్చును గదా! రాము డట్లొనర్చియుండినచో పంద్రెండేడులు దుర్భర మగు శోకవేదన ననుభవించుచు కృశింపనేల? ఇట్టి వాదములన్నియు రామునిశీలమునకు భంగము నాపాదింపగలవు. ఋష్యశృంగుని యాశీర్వాదము కూడ వసిష్ఠుని యాశీర్వాదమువలెనే గృహీతము. ఇవి యేవియు ప్రత్యాశావాద పోషకములు గావు.

తృతీయాంకమున రామునితో సంభాషించుచు, వనదేవతయగు వాసంతి, " పరిత్యక్తయైన సీతగతి యెట్టిదో తెలియునా ? " అని యతనిని ప్రశ్నించినది. రాముడామెకొసగిన ప్రత్యుత్తరమును గమనింపుడు :—

'క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా '—

వ్యాఘ్రాది క్రూరమృగములచే సీత తప్పక కబళింపబడియుండునని రాముని నిశ్చయము. సీతావిషయము ద్వాదశవర్షములనుండియు నేమాత్రమును శ్రుతిగోచరము గానప్పుడు రాముడిట్టినిశ్చయమునకు వచ్చుటలో నాశ్చర్యములేదు. సీత బ్రదికియున్నదను భ్రాంతికూడ రామునకులేదని యీ వాక్యము స్పష్టమొనర్చుచుండగా, నతనికి ప్రత్యాశయున్నదని యెట్లు చెప్పగలము ? కానిచో ప్రత్యాశావాదమును నిలబెట్టుటకై రామునకు వంచన నాపాదింపవలసియుండును. అది యుక్తముగాదు గదా !

మఱియు, నదే ఘట్టమున రాముడు — "దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశ పరివత్సరః ప్రణష్టమివ నామాపి న చ రామో న జీవతి " — అను వాక్యమున సీత యను పేరుకూడ లేకుండబోయిన దను నర్థమును వ్యక్తపఱచినాడు. మఱియు, రావణుడొనర్చిన సీతాపహరణమువలన తనకు పూర్వము గల్గిన వియోగమునకు అవధియుండుటచే నది సహ్యమైనదనియు, నిప్పటి యీ వియోగము 'నిరవధి' అగుటచే సహింపరానిదనియు నతడే వ్రాకుచ్చినాడు. కావున, సీత బ్రతికియున్నదనికాని, యామెతో తనకు పునస్సంయోగము కల్గుననిగాని రామున కేమాత్రమును తెలియదు. వసిష్ఠఋష్యశృంగుల యాశీస్సులనుబట్టి రామునకు ప్రత్యాశయున్నదని చెప్పినచో రాముని రోదనమును, అతడు పల్కిన యీ వాక్యములును నర్థరహితములగును. రాముడు తన్ను వంచించుకొనుచుండుటయే గాక, తన యాప్తులగువారిని గూడ వంచించుచున్నాడని మనము చెప్పవలసియుండును. ఇది యంతయు ననుచితము.

రతిభావసూచకములగు వాక్యములు నాటకమున గలవనియు, నవి కరుణ విప్రలంభపోషకము లనియు వేదమువారి రెండవవాదము. వియోగమునందు, నాయికానాయకు లనుభవించు శోకమునకు, తత్పూర్వమగు వారి దాంపత్య మాధారము కాక మఱి యేది కాగలదు ? వారి పరస్పరానురాగము నాధారముగ చేసికొనియే వియోగమును పోషింపవలసియున్నది. జనస్థానము నందలి ప్రదేశము

లన్నియు, నాయికానాయకుల ప్రణయజీవితమును స్మరణకు తెచ్చుచున్నవి. కావుననే వియోగము మఱింత కష్టతరమైనది. అట్టిచో రతిభావసూచకములగు వాక్యములుండకుండుట యెట్లు? ఇవి యేవియు కరుణవిప్రలంభమున కాధారము కాజాలవు. అది యట్లుండ, నాయకుడు సాధింపదలచిన ప్రయోజనముతో రసమును సమన్వయింపచేయవలయును గదా! నాయకుడు సాధింపతలచుకొన్నది ధర్మము. అప్పటికింకను వియోగము కల్గియుండలేదు. అట్టిచో విప్రలంభమునకు నాటకారంభముతో సమన్వయమెట్లు? నాటకారంభముతోను, నాయకుడు సాధింపతలచిన ప్రయోజనముతోను, తత్ప్రయోజనమును సాధించుట యందాతడొనర్చిన ప్రయత్నముతోడను, నివి యేమాత్రము ననుసంధింపజాలవు. ధర్మైకపరమగు నాయకుని యుత్సాహముతో నితివృత్తమారంభమైనది. తద్ధర్మసాధనోద్దేశముతోడనే కథాసంవిధాన మేర్పడినది. ధర్మపథమునందేర్పడిన వియోగము తొలగి ధర్మము రక్షితమైనది. కనుక నాటకమున ధర్మవీర మంగిరసమనియు, కరుణ యంగమనియు నిర్ణయమగుచున్నది.

మఱియొక విషయము. శృంగారముగాని వీరముగాని నాటకమునందు ప్రధానరసముగ నుండుననుట ఆలంకారికుల వివరణము. ఇందులకు బలీయమగు కారణము లేకపోలేదు. రతి, ఉత్సాహము, హాసము, శోకము, క్రోధము, జుగుప్స, యిత్యాదిభావము లన్నిటిలోను మానవజీవితమునందధిక ప్రాధాన్యము వహించునవి రత్యుత్సాహములు మాత్రమే! జీవితమున వీనికున్నంతటి ప్రాబల్యమితరములకు లేదు జీవితమునందు చిరకాలము ప్రాబల్యము వహించియుండుటకు కూడ రత్యుత్సాహములకు సాధ్యమగుచున్నది. కావున శృంగారవీరములను మనము చాలకాల మనుభవింపగలము. రౌద్ర భయానక బీభత్సాదుల విషయము వేఱు; వానిని దీర్ఘకాల మనుభవింపజాలము. హాస్యమునుగూడ నెంతయోకాల మనుభవించుటకు మనకు సాధ్యముగాదు. కావుననే సమగ్రమగు నితివృత్తములను ప్రదర్శించెడి నాటకములలో హాస్యాదులను ప్రధానరసములుగా చేయుటకు సాధ్యము కాకపోయినది. ఆరంభమునుండియు, ఫలాగమము వఱకును నొకే విధమున రౌద్రము, హాస్యము – ఇత్యాదులను పోషించుటగాని, ఒకవేళ పోషించినను – సామాజికులు వాని ననుభవించుటకుగాని సాధ్యముకాదు. హృదయమును, నితరేంద్రియములను, మిక్కిలిగ క్షోభింపచేయునవి యగుటచే వీనిని తాత్కాలికముగ స్వల్పకాల మనుభవింపగలమే కాని దీర్ఘకాల మనుభవింపలేము. శోకానుభవమునకుగూడ జీవితమునందవధి గలదు. దీర్ఘకాల శోకానుభూతిచే చిత్తమునకు

జడతయేర్పడును. కావుననే, కరుణగూడ ప్రధానరసముగ నాటకములలో పోషితము కాలేదు. ఉత్తరరామచరిత్రయందు అంగమైయున్న కరుణముత్తమముగ పోషితమై యుండుటచే స్థూలదృష్టికి అదియే ప్రధానమను భ్రాంతిని కలిగించుచున్నది.

రసపోషణ విషయమున కవి కల్పించిన విశిష్టసన్నివేశము లెట్టివో పైన వివరింపబడినవి. ఆ యా భావములను ప్రతిపాదించుటయందును, చిత్రములను ప్రత్యక్షీకరించుటయందును, భవభూతి కల్పించిన కవితాశిల్పము పండిత విమర్శలకు ప్రశంసకు పాత్రమైనది.

భావములు సుకుమారములు, లలితములు నైనచోట్ల భవభూతి సమాస రహితము మృదుమధురము నగు భాషను వాడి భావస్ఫూర్తిని సుగమమొనర్చి యున్నాడు. ప్రజలతృప్తికొఱకై రాముడు సీతాత్యాగము గావించి విరహవ్యథ ననుభవించుచుండియు రాజ్యభారముగూడ వహింపవలసివచ్చినది. సీతకు జరిగిన యన్యాయమును రాముడు గుర్తెఱుంగకపోలేదు. ఐనను, రాజధర్మముననుసరించి స్వకీయమగు బాధను రాముడు సహించుచున్నాడు. అట్టి రామునియవస్థను తమసచే కవి వర్ణింపజేసిన విధము గమనింపనగును.

> "ఇదం విశ్వం పాల్యం విధివదభియుక్తేన మనసా
> ప్రియాశోకో జీవం కుసుమ మివ ఘర్మో గ్లపయతి,
> స్వయం కృత్వా త్యాగం విలపనవినోదోఽప్యసులభ
> స్తదద్యాప్యుచ్ఛ్వాసో భవతి ననులాభోహిరుదితం."

రాజధర్మము ననుసరించి ప్రజాపాలనము గావింపవలసియున్నది. ప్రియాశోకము జీవకుసుమము ప్రచండాతపమువలె శోషింపచేయుచున్నది. చేతులారచేసిన త్యాగమగుటచే బాహాటముగ నేడ్చి హృదయభారమును తగ్గించుకొనుటకుకూడ వీలులేదు. అట్టి అవకాశము రామునకిపుడు జనస్థానమున లభించినది. కావున, రోదనముకూడ నొకవిధముగ నుపకారమేయైనదని భావము. కవి యుపయోగించిన సమాసరహితమగు రచన భావమును సులభగ్రాహ్యమొనర్చుటకు తోడ్పడినది. ప్రయోగించిన యుపమానవైశిష్ట్యమునుగూడ గుర్తింపనగును.

అరణ్యవాసమున పూర్వము రాజునకు సీతావియోగము కలిగినది. రావణ సంహారమే అవధిగాగల వియోగమది. సుగ్రీవాదుల సాహాయ్యమున సీతావృత్తాం తము నెఱుగుటకును, లంకాద్వీపముచేరి లక్ష్మణసాహాయ్యముచే శత్రువుల సంహ

రించి సీతను విడిపించుకొనుటకును రామునకు సాధ్యమైనది. రాముని ప్రస్తుత వియోగావస్థ తద్విపరీతమైనట్టిది. సీతయునికిని గూర్చియే రామునకు తెలియదు. స్వయంకృతత్యాగ మగుటచేతను, నది ప్రజాపవాదమూల మగుటచేతను, అన్వేషణ ప్రయత్నముకూడ తగదు. సుగ్రీవాదుల సఖ్యముగాని, మారుతి పరాక్రమముగాని, లక్ష్మణాదుల శౌర్యముగాని,—నేదియు నుపకరింపనిపరిస్థితి రామునిది. ఈభావమును భవభూతి వ్యక్తపఱచిన విధమును పరిశీలింపుడు :—

'వ్యర్థం యత్ర కపీంద్రసఖ్యమపి మే వీర్యం హరీణాం వృథా.
ప్రజ్ఞా జాంబవతోఽపి యత్ర, నగతి ర్పుత్రస్య వాయోరపి,
మార్గం యత్ర న విశ్వకర్మ తనయః కర్తుం నలోఽపి క్షమః
సౌమిత్రేరపి పత్త్రిణామవిషయే తత్రప్రియే క్వాసి మే.'

ఇట్టి యుదాహరణము లెన్నియో గలవు.

వర్ణనీయ విషయ చిత్రమును పాఠకుల మనోనయనము నెదుట పత్యక్షీరింప చేయు సామర్థ్యమున కొక యుదాహరణము. జనస్థానమున పర్యటించుచున్న రామునకు వనదేవతయగు వాసంతి, సీతావర్ధితమగు మయూరమును చూపించినది. పురి విప్పి ఆడుచున్న తన్మయూర కిశోరమును సీత చేతితో తాళము వేయుచు తన చుట్టును నాడునట్లుచేసిన దృశ్యమును కవి యెట్లు చిత్రించినాడో చూతము.

"భ్రమిషు కృతపుటాంతర్మండలాఽవృత్తి చక్షుః
ప్రచలితచతురభ్రూతాండవై ర్మండయన్త్యా
కరకిసలయతాలై ర్ముగ్ధయా న ర్త్యమానమ్
సుతమివ మనసా త్వాం వత్సలేన స్మరామి"

మయూరమును మండలాకార నృత్తమున చలించునట్లుచేయుటకై సీత నేత్ర సంజ్ఞల నొనర్చుచు చేతులతో తాళము వేయుచున్నది. కనుసన్న లొనర్చు చుండుటచే కనుబొమలు ప్రచలితములై, ముఖమునకొక వింతశోభను గల్గించుచున్నవి. తాళమువేయుటయందు ప్రవృత్తములై యున్న సీతాహస్తములు కిసలయముల వలె భాసించుచున్నవి. యౌవనప్రాదుర్భావముననున్న రమణీయమగు సీతాస్వరూప మును కవి, 'ముగ్ధయా' అను పదముచే వ్యక్తముచేసియున్నాడు. మయూర కిశోరము నాడించి వినోదించుట, అప్పటి సీత వయస్సునకును మిక్కిలి తగి యున్నది. ఈ వర్ణన, నృత్తప్రవృత్తియందున్న సీతామయూరముల చిత్రముల నొక్కసారిగా పత్యక్షమొనర్పజాలియున్నది.

సహజములు, నర్థవంతములు నగు నలంకారాదులచే భావమును పోషించుట భవభూతికవితావిశేషములలో నొకటి. కాళిదాసు వలెనే యితడును నుపమానముల నెట్లుచితముగ గ్రహించినాడో చూడనగును. బాల్యమాదిగ నెంతో ప్రేమతో పెంచిన సీత నరణ్యములపాలుచేయ నిశ్చయించి రాముడు దుఃఖించుచు,

'పరి దదామి మృత్యవే, సౌనికో గృహశకుంతికా మివ'—

అని పలికినాడు. ఎంతయో ముద్దుగ పెంచిన శకుంతమును (చిలుకను) కటికవాడు వలె తానును, 'సీతను మృత్యువున కప్పగించుచున్నా' నని రాముని విలాపము. ఉపమానమందలి ఔచిత్యము సులభవేద్యము.

గురువు బోధించు నర్థము ప్రాజ్ఞులగు శిష్యులబుద్ధి కవగతమగుటయు, జడులకు గోచరింపకపోవుటయు, నను భావమును వ్యక్తపఱచుటకు, భవభూతి గ్రహించిన యుపమానమును పరిశీలింపుడు :—

'ప్రభవతి శుచిర్బింబగ్రాహే మణిర్నమృదాద యః'—

(వస్తువుయొక్క బింబము స్వచ్ఛమగు మణియందు పడును గాని మట్టిముద్దయందు పడదు గదా !) అను నుపమానమెంత యర్థవంతమైయున్నదో గమనింపవచ్చును. జడబుద్ధిని మట్టిముద్ద యని పిలుచుట లోకమున వాడుకలో నున్నది.

వియోగదుఃఖార్తిచే కృశించి, వాడిపోయియున్న సీతాస్వరూపమును, తమసచే వర్ణింపచేయుచు కవి ప్రయోగించిన ఉపమానములు అతిమనోహరములు:-

'కిసలయమివ ముగ్ధం బంధనాద్విప్రలూనం,
హృదయకమలశోషీ దారుణో దీర్ఘశోకః,
గ్లపయతి పరిపాండుక్షామమస్యా శ్శరీరమ్,
శరదిజ ఇవ ఘర్మః కేతకీగర్భపత్రమ్ ॥'

సీతాదేహ మిపుడు తొడిమనుండి వాలిన చిగురువలె లావణ్యరహితమై యున్నది. (విరహవ్యథచే) కృశించి, వెల్లనైయున్న యీమెదేహము, హృదయకమలమును వాడ్చుచున్న దీర్ఘశోకముచే నీరసింపచేయబడుచున్నది. ఈ సుకుమారభావమును పోషించుటకు, కవి గ్రహించిన సహజోపమానములను గ్రహింతము. మొగలి చెండులోని గర్భపత్త్రము, శరత్కాలపు యెండయొక్క కాకచే కందిపోవుట యిం దుపమానము. గర్భపత్త్రమతి కోమలమైనది. అనేకములగు పత్త్రములు దీనిపై కప్పియుండి గాలి సోకుటకుగూడ వీలులేకుండుటచే నెండవలన గల్గు కాక, యీ గర్భపత్త్రమున కధికమగుచున్నది. మఱియు, శరత్కాలము చెమ్మతో గూడినది

యగుటచే తత్కాలపు టెండవేడిమికి తపింపజేయు శక్తి యెక్కువ. కావున చెమ్మతో గూడిన యీ యెండవలన కోమలమగు కేతకీగర్భపత్త్రము, లోపలనే కుమిలి లావణ్యమును గోల్పోవుచున్నది. ఇట్టి యుపమానము వర్ణనీయభావమును సంపూర్ణముగ పోషించునది యైయున్నది.

శోకభారముచే నిండియున్న హృదయము, రోదనమువలన తేలికయగుటచే జీవితము రక్షితమగుచున్నదను విషయము కవి ప్రతిపాదించుచు, పూర్ణతటాక విషయము నిందుపమానము గావించినాడు.

'పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా,
శోకక్షోభే చ హృదయం, ప్రలాపై రేవ ధార్యతే ॥ '—

జలపరిపూర్ణమైయున్న తటాకమునకు నొత్తిడి యెక్కువ. నీరు బైటికి పోవుటకు తగిన తూము లేకున్నచో కట్ట తెగి తటాకము భగ్నముగావచ్చును. కావున నట్టిసందర్భములలో పరివాహమే రక్షకమగుచున్నది. అట్లే దుఃఖముచే నిండియున్న హృదయమును, రోదనముచే రక్షితమగుచున్నది. ఇట్టి మనోహరోదాహరణము లింకను గలవు.

అలంకారసాహాయ్యము లేకయే భావమును స్పష్టముగ పోషించుటలో కవి మఱి యొక విశిష్టవిధానము నవలంబించియున్నాడు. లలితమగు దృశ్యమునుగాని, సన్నివేశమునుగాని, యథాస్వభావముగ, క్రమబద్ధముగ చిత్రించి భావచిత్రములు మనసున, ( హృదయమున ) నచ్చుపడునట్లు చేయుట భవభూతి అవలంబించిన విధానము.

" కిమపి కిమపి మన్దం మన్దమాసక్తియోగా
దవిరలితకపోలం జల్పతో రక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్ ॥ "

అను శ్లోకమున సీతారాముల ప్రణయగాథను కవి చిత్రించిన విధము సహృదయైకవేద్యము.

సీతాపవాదమును వినిన రాముడు ఆమెనుగూర్చి పల్కిన పల్కులు అలంకారరహితములయ్యును, నెంత యర్థవంతములై యున్నవో గమనింపవచ్చును :—

'త్వయా జగన్తి పుణ్యాని త్వయ్యపుణ్యా జనోక్తయః
నాథవన్తస్త్వయా లోకా స్త్వమనాథా విపత్స్యసే ॥ '

( సీతచే జగము పవిత్రమైనది. కాని అట్టి సీతవిషయమున జనులు పాపము పల్కుచున్నారు. సీతయాధారమున లోకములు రక్షితములై యున్నవి. అట్టి సీత యిప్పుడు రక్షణ లేనిదగుచున్నది.) అను వాక్యములలో సీతామాహాత్మ్యపావిత్ర్యము లెట్టివో వ్యక్తీకరింపబడియున్నవి.

సీతకు గల్గిన యనర్థమును తలంచుకొని పరితపించుచున్న జనకునిచే కవి పల్కించిన వాక్యములను గమనింపుడు : —

"అనియతరుదితస్మితం విరాజ
త్కతిపయ కోమలదంతకుట్మలాగ్రమ్,
వదనకమలకం శిశోః స్మరామి
స్ఖలద సమంజస మంజు జల్పితం తే ॥ "

సీతాశైశవచిత్రము జనకుని హృదయమున ప్రస్ఫుటముగ నిల్చియున్నది. ప్రకృతి సహజమగు విషయమిది. పిల్లల కాపదకల్గినపుడు తలిదండ్రులు వారి బాల్యక్రీడను శైశవలీలలను, స్మరించుకొని దుఃఖించుట ప్రకృతిసిద్ధమగు విషయము. జనకుడును నట్లే సీతాశైశవమును స్మరించుచున్నాడు. కారణములేకయే ఒకప్పుడేడ్చుటయు, మఱల నంతలో నవ్వుటయు, ననునవి శైశవప్రకృతికి సహజములగు విషయములు. కావుననే వారి యేడ్పులు, నవ్వులు నవ్యవస్థితములు. ఈ విషయమును కవి ' అనియత ' శబ్దప్రయోగముచే స్ఫురింపచేసినాడు. అట్టిసమయములలో శిశువక్త్ర మందలి కతిపయములు, కోమలములు నగు దంతకుట్మలములు మనోహరములుగ కనవచ్చును. అసంపూర్ణములు పూర్వాపరసంబంధరహితములునైనను, పిల్లలమాట లెంతయు హృదయాహ్లాదకరములు. అట్టి శైశవావస్థయందలి సీతాముఖకమలమును జనకుడు స్మరించుకొని దుఃఖించుచున్నాడు. ఈ వర్ణన యందలి స్వభావరామణీయ కము సహృదయవేద్యము. శాకుంతలమందలి,

' ఆలక్ష్య దంతముకుళాననిమిత్తహాసైః ' —

అను కాళిదాస శ్లోకము, భవభూతి గావించిన యీ వర్ణనకు మాతృక యనుట నిస్సందేహము.

ఇక భావోద్వేగభావావేశములను, కవి వర్ణించిన విధమును పరికింతము. వ్యక్తముగావింపవలసిన విశిష్టభావమును స్ఫురింపచేయుటకై సమర్థములగు సదృశ విషయముల ననేకముల నొకటివెంబడి యొకటిగా నొకచో వర్ణించి, భావోద్వేగ స్ఫూర్తిని కల్గించుట యితని పద్ధతి.

"వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శేస్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి చసమున్మీలయతి చ ॥ "—

సీతాస్పర్శవలన తనకు గల్గిన యనుభూతివైశిష్ట్యమెట్టిదో రాముడు వర్ణించు చున్నాడు. 'అది సుఖమో దుఃఖమో నిశ్చయింప శక్యముగానిది. అట్లే ప్రమోహము, నిద్రయో, విషవిసర్పమో లేక మదమో తెలియరాదు. ఇంద్రియ సమూహమును మోహపఱచుచున్న యేదో యొక వికారము స్పర్శస్పర్శయందును, నా చైతన్యమున కొకక్షోభను, అంతలో మఱల నుల్లాసమును, కల్గించుచున్నది.' అని భావము.

ఇట్లే అరణ్యమున విడువబడిన సీత వ్యాఘ్రాదులవాత బడియుండునని యూహించుచున్న రాముడు తన హృదయవ్యథ నిట్లు వివరించుచున్నాడు ;—

'దళతిహృదయం శోకోద్వేగం, ద్విధా తు న భిద్యతే,
వహతి వికలః కాయో మోహం, న ముంచతి చేతనామ్.
జ్వలయతి తనూమంతర్దాహః, కరోతి న భస్మసా
త్ప్రహరతి విధిర్మర్మచ్ఛేదీ, న కృంతతి జీవితమ్.'—

శోకోద్వేగముచే గుండె వ్రీలుచున్నది. కాని రెండుగా పగిలిపోవుటలేదు. (పగిలిపోయినచో బాధ యుండదని రాముని ఆశ). దేహము వికలమై మోహము నకు లోనగుచున్నది. కాని చైతన్యమును గోల్పోవుటలేదు. (చైతన్యమే నశిం చినచో దుఃఖానుభూతి యుండదు). అంతర్గతమగు దుఃఖాగ్ని తనువును కాల్చు చున్నదేకాని, దానిని బూడిదగ నొనర్చుటలేదు. (బూడిదయైనచో తాపము చల్లారును). విధి ఆయువుపట్టులను కోయుచున్నాదేకాని, జీవితమును కోసివేయుట లేదు. (కావుననే విధికి కరుణలేదు). ఒకటివెంబడి యొకటిగ వర్ణించిన యీ విషయములచే రాముడనుభవించుచున్న బాధయొక్క అతిశయ మెట్టిదో స్పష్ట మొనర్పబడినది. ఈ విధమగు భావోద్వేగచిత్రణము భవభూతి కభిమానమగు విషయము. ఇట్టి శ్లోకము లీ నాటకము నందనేకములు.

అసాధారణమగు భవభూతికవితాశిల్ప మిట్లీనాటకమున నాద్యంతము ప్రత్యక్ష మగుచునేయున్నది. పాత్రపోషణవిషయమున నీ కవి పోషించిన యౌచిత్యముకూడ నెంతయు ప్రశంసింపదగినది. ఎంత యవమానమునకును, వ్యథకును, లోనై యున్నను సీత, భర్తనుగూర్చి పల్లెత్తుమాటయైన పలుకకుండుట యిందుల కొక

నిదర్శనము. వాల్మీకి మనకొసంగిన సీతాపాత్రోదాత్తతను, భవభూతి చాల జాగరూకుడై రక్షించియున్నాడు. గర్భశోకమునకు లోనైన జనకుని ప్రవృత్తి నెంతో సంయమనముతో కవి చిత్రించినాడు. సీతవిషయమున తనకును, లోకమునకును గల సానుభూతినంతను కవి చాల నేర్పుతో వనదేవతయగు వాసంతి పల్కులలో ప్రదర్శించినాడు. వాసంతీపాత్రకల్పనము భవభూతిప్రతిభకు చక్కని తార్కాణము. కంచుకివంటి అప్రధానపాత్రలను పోషించుటయందుగూడ భవభూతి వహించిన జాగ్రత్త గమనింపనగును. ప్రథమాంకమున కంచుకి ప్రవేశించి, 'రామభద్రా!' అని సంబోధింపబోయి, అర్థోక్తిలోనే జంకి, 'మహారాజా!'అని రాముని సంబోధించుటయు, రాముడు చిరునవ్వుతో నతని, 'నార్యా!' అని సంబోధించుటయు మనము గమనింపవచ్చును. బాల్యమాదిగ తన కనులయెదుట తన చేతులలో పెరిగిన రామచంద్రుని, 'రామభద్రా!' యని పిలుచుట కంచుక్యాదులకు పరిపాటియైనది. క్రొత్తగ పట్టాభిషిక్తుడైన రాముని పల్కరించుటలో కంచుకి అలవాటుచొప్పున 'రామభద్రా!' యని సంబోధింపబోయి, వెంటనే తన్నుదాను సర్దుకొన్నాడు.

కుశలవుల పాత్రయందు జన్మసిద్ధమగు క్షాత్త్రమును, ఆశ్రమనివాసముచే సిద్ధించిన వినీతిసంప్రదాయాది జ్ఞానమును స్పష్టముగ పోషితములై యున్నవి. సహజసిద్ధములగు శౌర్యసాహసాదులతోపాటు చంద్రకేతువునందు వంశానుగతములగు నౌదార్యము, ధర్మదీక్షయు నెలకొన్నవి. ప్రధానపాత్రలవిషయముననే కాక, సాధారణపాత్రల విషయమునగూడ కవి ప్రదర్శించిన ఔచితి ప్రశంసనీయము. చతుర్థాంకమునకు మొదటనుండు విష్కంభమునందలి శిష్యులసంభాషణ మిందులకు చక్కని నిదర్శనము.

భవభూతి యిట్లు కథాసంవిధానము, సన్నివేశకల్పనము, రసపోషణము, పాత్రపోషణము మున్నగు విషయములలో నసాధారణమగు ప్రతిభను, చాతుర్యమును ప్రదర్శించినాడు. అతిలోకరమణీయమగు సీతాదేవి ఉత్తరజీవితగాథను, అప్రతిమానమగు తన కవితాశిల్పముచే ననితరసాధ్యమగు రూపకముగ దిద్ది తీర్చియున్నాడు.

ఉత్తరరామచరిత్రయందు కథాప్రవృత్తికి (Action and Movement.) ప్రాధాన్యములేదని పాశ్చాత్యుల విమర్శ. ఈ విమర్శ చాలవఱకు సంస్కృత నాటకములన్నిటికి వర్తించునదియే! ఇందులకు కారణము లేకపోలేదు. రూపకరచనలో పాశ్చాత్యులదృష్టియంతయు, కథాప్రవృత్తిపైనను, పాత్రపోషణపైనను, నిల్చియుండును. సామాజికులకు కలుగవలసిన వినోదముగాని, ధర్మబోధగాని, కథనుబట్టియు, పాత్రల శీలస్వభావాదులనుబట్టియు, జరుగవలయును. మోదాంతము

లగు రూపకముల ప్రదర్శనమున సామాజికులు వినోదమునందుదురు. ఖేదాంత నాటకప్రదర్శనముచే సామాజికుల హృదయములు క్షోభితములై, న్యాయధర్మముల కుసుమ్మితములగును. కావున పాశ్చాత్యనాటకకర్తలెల్లరును నితివృత్తము నెడతెగక నడపించుటయందును, పాత్రలశీలమును పోషించుటయందును దృష్టినిడి, తమ సామర్థ్యమును వానికై వినియోగింతురు.

సంస్కృతనాటకముల విషయము వేఱు. రచయితదృష్టి ముఖ్యముగా రసపోషణపై కేంద్రీకరించును. ఇంతమాత్రమున, ఇతివృత్తపోషణ పాత్రపోషణలు కొఱవడునని చెప్పుటకాదు. అన్నిటికంటెను రసపోషణమే నాటకమున ప్రధానమైన విషయమని భావము. నాయికానాయకేతివృత్త మాధారముగ సామాజికులహృదయములలో ననురూపమగు స్థాయిభావము నుద్బుద్ధముగావించి, దాని ననుకూల సన్నివేశములచేతను, రసపర్యవసితమొనర్చి, ప్రేక్షకుల నానందానుభూతికి లోనుగా జేయుట రచయిత ప్రయత్నము. రసపోషణములగు సన్నివేశములతోడను, నాయికానాయక హృదయగతభావముతోడను సామాజికులకు తాదాత్మ్యమును గల్గించుట యెంతయు ముఖ్యము. కావున, సంస్కృతనాటకములలో నాటకప్రవృత్తికంటెను, రసపోషణమే ప్రధానమైయుండక తప్పదు. సంస్కృతపాశ్చాత్యరూపములకు గల యీ ముఖ్యభేదమును గమనింపకుండుట యిట్టి విమర్శలకు హేతువగుచున్నది. సంస్కృతముతో పరిచయములేనివారు కూడ తమకుగల యాంగ్లసాహిత్యపరిచయము మాత్రమే ఆధారముచేసికొని సంస్కృతరూపములను విమర్శింపబూనినందున నిట్టి విపరీతాభిప్రాయము లనేకములు ప్రచారములోనికి వచ్చినవి. పాశ్చాత్య సాహిత్యమునందు వీరికిగల అభినివేశముకంటె నెక్కువగ, సంస్కృతసాహిత్య విషయమున వీరికిగల అజ్ఞతను ఇవి చాటి చెప్పుచున్నవి. భవభూతిరచనలో వ్యంగ్యగౌరవము లేదనియు, వాచ్యమధికమనియు, పండితుల యభిప్రాయము. కాళిదాసుతో పోల్చిచూచినచో నీ విమర్శయందు సత్యమున్నదని తోపకపోదు. అంతియేకాక, ఆ యా సన్నివేశములలో భవభూతి తానే భావావేశమునకులోనై వర్ణనలను మితిమీరి చేయుటయు కలదు. శ్రవ్యకావ్యరచయితవలె వర్ణనీయ విషయము నతిమాత్రము పోషించుట భవభూతికి పరిపాటి. నాటకరచనవిషయమున నిదియొక లోపమనక తప్పదు. కాళిదాసిట్టిపట్టులలో నెంతయు సంయమనమును ప్రదర్శించినాడు. ఈ విషయములలో తప్ప, భవభూతి కాళిదాసునకు తీసిపోడు. కావుననే, సంస్కృతనాటకకర్తలలో కాళిదాసుతర్వాత భవభూతియే ప్రధానుడని పండితులు నిర్ణయించియున్నారు.

---

# భాసుడు — యజ్ఞఫల నాటకము

జీరెడ్డి చెన్నారెడ్డి, ఎమ్. ఏ.

1912-వ సంవత్సరమున శ్రీ మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు, "త్రివేంద్రము సంస్కృత సీరీస్" నుండి పదుమూడురూపకములు ప్రకటించిరి. అవన్నియు భాసకృతములనియేవారి నిర్ణయము [1] కావుననే ఆరూపకసంచయమునకు వారు "భాసనాటకచక్ర" మని పేరిడిరి. ఆ నాటివరకు భాసుడు రూపకరచయితగా కాళిదాసబాణాదులచే నచ్చటచ్చట పేర్కొనబడినవాడేకాని ప్రత్యక్షముగ నతని రచన ముల నెవ్వరును జూచియుండలేదు. మన యదృష్టవశమున శ్రీ గణపతిశాస్త్రిగారి పరిశ్రమఫలితముగా లభించిన పదమూడు రూపకములలో నొకదాని యందేని గ్రంథ నామము కాని, తద్రచయిత పేరుకాని [2] లభింపలేదు. అన్నిటియందును రచనా పద్ధతియు శైలియు నొకతీరుననేయుండుటంబట్టి వానినన్నిటి నొకవ్యక్తియే రచించి యుండునని యూహింపవలసియున్నది. వానిలో రెండిటి మూడిటినుండి కొన్నిపద్య ములను ప్రాచీనాలంకారికులు కొందరు తమ లక్షణగ్రంథములలో నుదాహరించుచు వానిని భాసరచితములుగా సూచించిరి. [3] ఆ పద్యములలో కొన్ని యీ నాటకము లందు కన్పించుటచే నవియు, తత్తుల్యలక్షణములేకల తక్కినవియు భాసకృతములే యని శ్రీ గణపతిశాస్త్రిగారు సకారణముగా నిర్ణయించిరి. "స్వప్నవాసవదత్త" మున్నగు నొకటి రెండుపేర్లు వానియందలి పద్యములుదాహరించిన లాక్షణికులు వాడినవో లేక ప్రతులు వ్రాసికొన్నవారు కడపటి పత్రముపై గుర్తుంచుకొన్నవో తప్ప లభించిన ప్రతులలో గ్రంథభాగమున నవికూడలేవు. ప్రతిమాదులవ్నియు శ్రీ గణపతిశాస్త్రిగారు ప్రకటించిన నామములే.

లభించిన పదమూడు రూపకములలో గానవగు సామాన్యలక్షణములలో ముఖ్యములైన వీక్రిందివి. [4]

1. అన్నింటిలో "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అను వాక్యముతో గ్రంథప్రారంభమగుట. దీనినే బాణుడు తన హర్షచరిత పీఠికలో భాసనాటకముల నుద్దేశించి "సూత్రధారకృతారంభైః నాటకైః" అని సూచించినాడు.

1. Introduction to 'Svapnavasavadatta' by Sri Ganapati Sastri.
2. Introduction Page ii & iii Bhasanatakachakra. Edited by Sri C. R. Devadhar.
3. Bhasa — By Pusalkar. ch. VII. (Published by Bharatiya Vidya Studies. Bombay.)
4. Bhasa — By A. D. Pusalkar.

2. మంగళశ్లోకమున ముద్రాలంకారము తరచుగా గాన్పించుట.

3. ప్రస్తావనకు పర్యాయముగనన్ని రూపకములందును "స్థాపనా" యను పదముండుట. ఆ స్థాపనయు మిక్కిలి సంగ్రహరూపముననుండుట.

4. దాదాపన్నింట స్థాపనయందు "ఏవం ఆర్యమిశ్రాన్ విజ్ఞాపయామి! అయే! కిన్నుఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్దఇవశ్రూయతే! అంగ! పశ్యామి!" అను వాక్యమును సూత్రధారుడు మంగళశ్లోకానంతరము ఉచ్చరించుట.

5. పెక్కురూపకములందు ప్రయోగాతిశయపద్ధతిలో పాత్ర ప్రవేశమును సూచించుట.

6. ఒకటి రెండు శబ్దముల మార్పుతో నన్నినాటకములందును భరతవాక్య మొక విధముగనే యుండుట. "రాజసింహ" యను శబ్దము సాధారణముగ నందుండుట.

7. పెక్కు నాటకములలో "భరతునినాట్యశాస్త్రమున" నిర్దిష్టములగు నియమములు పాటింపబడకుండుట.

8. దీర్ఘకాలవ్యవధానముకోరు కార్యాంతరములను పాత్రములచే అల్పకాలవ్యవధిలో చేయించుటను సూచించు "నిష్క్రమ్య-ప్రవిశ్య" యను పదములువాడుట.

9. ఆకాశభాషితములను పేర కొన్ని పాత్రముల కథ నొక పాత్రముచేతనే చెప్పించుట.

10. పతాకాస్థానకములచే విశేషముగా భవిష్యదర్థములు సూచించుట. వీనినే బాణుడు "సపతాకైః నాటకైః" యని సూచించియున్నాడు.

11. వివిధ మనస్తత్త్వములు భిన్నభిన్న జీవనపద్ధతులుగల పాత్రములను ప్రవేశపెట్టుట. ఈ విషయమునే బాణుడు "బహుభూమికైః నాటకైః" యని ప్రశంసించినాడు.

12. అన్ని రూపకములందును ప్రతీహారి "విజయ" యను పేరనే వ్యవహరింపబడుట.

13. ఇవికాక వివిధ నాటకములలో విషయసాదృశ్యముకల సన్నివేశములు వర్ణనవిధానమునకూడ సదృశములై యుండుట గమనింపవచ్చును. వీనిలో "ఆపస్తావత్—ఇమా ఆపః" అను ప్రయోగము, వీరులగు వాలి, కర్ణ, దుర్యోధనుల మరణసమయమున ననుతాపము పుట్టించు రచనావై ఖరి, సీత, వసంతసేన, రావణుని,

కారుని శపించుఘట్టములు, దశరథుడు, వాలి, దుర్యోధనుడు ప్రాణోత్క్రమణ కాలమున వింత దృశ్యముల గాంచుచున్న వేశములు—పేర్కొనదగియున్నవి.

పై విషయములనన్నిటి నాధారముగ గొనియే శ్రీ గణపతిశాస్త్రిగారు తనకు లభించిన పదుమూడు రూపకములు భాసకృతములని నిరూపింపగలిగిరి. విమర్శక లోకమునవారి నిర్ణయముపై తీవ్రచర్చలు జరిగినను స్థూలముగనందరును వానిని భాసకృతములనియే యంగీకరించిరన వచ్చును. మరికొందరు వానినన్నిటిని భాస కృతములనకపోయినను ఏకకవికృతములే యను నభిప్రాయము వెలువరచిరి.

ఆ పదమూడు రూపకములలో "ప్రతిమా, అభిషేకము" లు రెండును రామాయణగాధ నితివృత్తముగా గలవి. పంచరాత్రము, మధ్యమవ్యాయోగము, కర్ణభారము, దూతవాక్యము, దూతఘటోత్కచము, ఊరుభంగము అను నారురూపక ములు మహాభారతకథ ననుసరించినవి. బాలచరితము, హరివంశకథ యాధారముగ గలది. ప్రతిజ్ఞాయౌగంధరాయణము స్వప్నవాసవదత్తము అవిమారకము చారిత్రక ములును కథాసరిత్సాగరగాథా (బృహత్కథా) మూలకములునైనవి. చారుదత్తము కవికల్పితమును సాంఘికమును నగు అసమగ్రరూపకము.

పై పదమూడు నాటకములు ప్రకటింపబడిన పిదప దాదాపు ముప్పదిసంవ త్సరములకు 1941-వ సంవత్సరమున భాసకృతముగా "యజ్ఞఫలనాటకము" గోం డల్ నందలి రసశాలాఔషధాశ్రమము శ్రీరాజవైద్య జీవరామ కాళిదాసశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. శ్రీ శాస్త్రిగారుదాని యుపోద్ఘాతములో "భాషాయాః అతిప్రాచీన సంస్కృతత్వాత్ — వస్తుకల్పనాయాః శ్రేష్ఠత్వాత్ — రసభావాలంకార నాట్యాంగానాం మనోహరతమత్వాత్ — బాణాదివర్ణితానేక సామాన్య భాసనాటక సంవాదిత్వాచ్చ" భాసకృతత్వమస్మాభిః దృఢం మన్యతే.[1] అని వ్రాసి యజ్ఞఫలనాటకముపై కారణ ములచే భాసరచితమేయని తాము దృఢముగా విశ్వసించినట్లు తెలిపిరి. ఇందలి యితివృత్తమునకు వాల్మీకి రామాయణమునందలి బాలకాండ కథమాత్రమే ఆధారము. ప్రతిమానాటకము అయోధ్యాకాండ కథతో నారంభమై యుద్ధకాండాంతమందు శ్రీ రామపట్టాభిషేకముతో ముగియును. అభిషేకనాటకము కిష్కింధాకాండకథతో నారంభమై క్రమముగా సుగ్రీవ, విభీషణ శ్రీరామపట్టాభిషేకములతో అంతమగును. కావున "త్రివేంద్రముసీరీస్"లోని రామనాటకములలో బాలకాండకథ మాత్రమేలేదు. ఈ యజ్ఞఫలనాటక మాలోపమును బూర్తిసేయుటకే యుత్పన్నమైనదేమో అన్నట్లు సీతావివాహముతో ముగియుచున్నది.

1. Yajnaphala Natakamu — 'Introduction' Page 2.

## యజ్ఞఫల నాటకమందలి కథాసంగ్రహము

ప్రథమాంకము :— దశరథమహారాజు మనోగతంబెరిగి సుమంత్రుడు రాజపుత్రజన్మోత్సవకాలమున పౌరజానపదుల దానసత్కారములచేత తనియ జేయును, సుందరకనాముడగు విదూషకుడు దశసహస్రమోదకమారణ సామ్యముచే దశసహస్రయోధమారకుడగు దశరథునితో పాటు తానును మహారథుడైనట్లు బీరములుపల్కును. దశరథుడు ప్రవేశించి తన కోరిక సుమంత్రుడు నెరవేర్చినట్లెరిగి తృప్తుడగును. కుమారుల విద్యావిషయమున అప్రమత్తుడుగానుండ దశరథుడు నిర్ణయించును. రాణులు మువ్వురును ఒకరివెంట నొకరు దూతీముఖమున భర్తృదర్శనము గోరుదురు. రాణులను మధ్యమందిరమున తన రాక ప్రతీక్షించు పట్లాదేశించి సంధ్యాకాలమగుడు రాజు అంతఃపురమునకేగును.

ద్వితీయాంకము :— మరునాటి మధ్యాహ్నవేళ గ్రీష్మోద్యానమున రాజు రాణులంగలిసికొని కుమారుల దాయభాగముంగూర్చి చర్చించును. కైకేయికి (భరతునకై) వరరూపమున రాజ్యదానము ముందే నిశ్చితమైనందున నామె నోటనే శ్రీరామునకు రాజ్యమిచ్చుట న్యాయమని నేర్పుమెయి రాజుపలికించును. రాణుల నిష్క్రమణానంతరము విదూషకుడు ప్రవేశించి తన అవ్యక్తసంభాషణముచే కైకేయివలన రాబోవు ననర్థమును సూచించును. రావణాగమన సూచనతో అంకము ముగియును.

తృతీయాంకము :— రావణుడు శ్రీరాముని పరాక్రమ విశేషము పరీక్షింపనదను వేచి అయోధ్యాపురప్రాసాద సమీపమున దిరుగాడుచుండును. విశ్వామిత్రుడును స్వయాగరక్షణార్థము దశరథునడిగి రామలక్ష్మణులను గొనిపోవవచ్చును. రావణ విశ్వామిత్రులు ఒకరియునికి మరియొకరికి తెలియదను భ్రమతో పరస్పరము గుర్తించుకొందురు. రాజపుత్రులతో వశిష్ఠుడు ప్రవేశించి నాడు అనధ్యయనమగుట వారిని ధనుర్వేదాభ్యాసము నిమిత్తము పురబహిఃప్రదేశమున కేగ ననుమతించును. లక్ష్మణభరతశత్రుఘ్నులు ధానుష్కపాటవము గనపరతురు. శ్రీరాముని బాణగమనమునకు రావణు డదృశ్యుడై విఘ్నమాపాదించును. కాని రామబాణపాతప్రభావాభిభూతుడై లంకకేగును. వెంటనే వశిష్ఠుడువచ్చి రామాదులకు విశ్వామిత్రాగమనము దెల్పును. పత్రపుష్పాపచయార్థము వచ్చిన మంథర వశిష్ఠునివెంటనున్న రామునిపై నీర్ష్యగొని కైకేయికి దుర్బోధసేయ నిశ్చయించి వెడలును.

చతుర్థాంకము :— విశ్వామిత్రుడు దశరథుని పజ్జకువచ్చి రాజకుమారుల విద్యలబరీక్షించును. దివ్యాస్త్రదానవ్యాజమున యాగరక్షణార్థము రామలక్ష్మణుల

దనవెంటపంపుమని కౌశికుడు దశరథుని యాచించును. వశిష్ఠప్రేరణమున రాజు రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంటబంప ననుమతించును.

పంచమాంకము :— తాటకాసుబాహులు వధింపబడి మారీచుడు దూరక్షిప్తుడగును. విశ్వామిత్రుడు రామునకు దివ్యాస్త్రదానముసేయును. రావణునకు రామునకు వైరమొదవునని విశ్వామిత్రుడు భవిష్యదర్థము సూచించును. రామలక్ష్మణులు ప్రకృతిదృశ్యములు తిలకింతురు. జనపదభాగములకువెళ్ళి రాజపుత్రులు కృషీవలుల దర్శింతురు. అచ్చట వారు గ్రామ్యజనుల గుణకర్మవ్యవహారము లెరుంగుదురు. విశ్వామిత్రుడు వృద్ధగోపికతోడి సంభాషణమిషతో రామలక్ష్మణులకు వ్యవహారజ్ఞానము కలిగించును. సీతాస్వయంవరార్థము శ్రీరాముని గొనిపోవనెంచి విశ్వామిత్రుడు వారిని జనకయజ్ఞదర్శనవ్యాజమున మిథిలాప్రయాణమునకు సంసిద్ధులంజేయును.

షష్ఠాంకము:— మిథిలయందు రాముడు ఉద్యానవనమున సీతను జూచును. సీతయు రాముని జూచును. పరస్పరము ప్రేమించుకొని విరహతప్తులగుదురు. జనకుడు ప్రవేశించి సీతను రామునకిచ్చుటకు నిశ్చయించినట్లు తెల్పును. దశరథాదులకాహ్వానము లంపబడును.

సప్తమాంకము :— రామ, భరత, లక్ష్మణ శత్రుఘ్నులకు వరుసగా సీతా మాండవ్యూర్మిళా శ్రుతకీర్తులతో వివాహములగును. పరశురాముడు శివధనుర్భంగజనితమైన క్రోధముతో ప్రవేశించి, రామునందు వైష్ణవతేజమును గాంచి ప్రశాంతుడగును. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు వధూవరులపై పుష్పవృష్టి కురియింతురు. భరతవాక్యముతో నాటకాంతము.

ఈ యజ్ఞఫలనాటకమందలి యితివృత్తము పరమపవిత్రమైనదనుటలో సందేహములేదు. కావున విషయగౌరవమును గూర్చి రెండభిప్రాయములుండుటకు వీలులేదు. ఇక ఈనాటకము భాసకృతముగునా, కాదా, యనుటలోనే భేదాభిప్రాయము లున్నవి. డాక్టరు పూసల్కరు,[1] ఎస్. ఎన్. సిన్హా[2] మున్నగువారు శ్రీ కాళిదాసశాస్త్రిగారి యభిప్రాయముతో నేకీభవించి యజ్ఞఫలము భాసకృతమనియే యంగీకరించిరి. అందులకు శ్రీ కాళిదాసశాస్త్రిగారు,

(1) "భాషాయాః అభిప్రాచీనసంస్కృతత్వాత్,

(2) వస్తుకల్పనాయాః శ్రేష్ఠత్వాత్.

1. Bhasa — By A. D. Pusalkar. Chap. VI.
2. Introduction to Pancharatra. Edited by S. N. Sinha, Sanskrit Saraswata Samiti, Bangalore.

(3) రసభావాలంకారనాట్యాంగానాం మనోహరతమత్వాత్,

(4) బాణాదివర్ణితానేకసామాన్యభాసనాటకసంవాదిత్వాచ్చ." అని నాలుగు కారణములు చూపించిరి. ముందు నేను పేర్కొన్న సామాన్యభాసనాటక లక్షణము లనదగిన "నాంద్యం తే తతః ప్రవిశతి సూత్రధారః" అను వాక్యము, మంగళశ్లోకమున ముద్రాలంకారము, ప్రస్తావనకు పర్యాయముగ స్థాపన యను పదము, ప్రయోగాతిశయపద్ధతిలో సుమంత్రప్రవేశము, భరతవాక్యమున రాజసింహ నామము, "నిష్క్రమ్య-ప్రవిశ్య" యను జంటపదముల యునికి, పతాకాస్థానకముల ప్రయోగము, బహుభూమికాప్రవేశము, విజయ యను ప్రతీహారినామము, విష్కంభకాదులలో మూడుపాత్రల ప్రవేశము, మున్నగు విషయములు యజ్ఞఫల నాటకమున గూడ కలవు. వీనిని గుర్తించియే శ్రీ కాళిదాసశాస్త్రిగారు, "బాణాది వర్ణితానేకసామాన్యభాసనాటకసంవాదిత్వాచ్చ" యని తన యభిప్రాయమునకు బలము సేకూర్చుకొనిరి. తెలుగుభాషలోని కానాటకమునునువదించిన కాకినాడ వాస్తవ్యులు శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారుకూడ శ్రీ శాస్త్రిగారి యభిప్రాయముతో నేకీభవించిరి.[1] కాళిదాసశాస్త్రిగారి నిర్ణయముతో వ్యతిరేకించినవారు లేకపోలేదు. శ్రీ పి. బాలకృష్ణమూర్తిగారు[2] పై యభిప్రాయమును ఖండించుచు నొక వ్యాసమును ప్రకటించిరి. 'మిథిక్‌సొసైటీ' వారి త్రైమాసిక పత్రికలో[3] యజ్ఞఫలనాటకమును సమీక్షించునది భాసకృతము కాదని సోపపత్తికముగా ఖండించిరి. అట్లే తెలుగున కనువదించిన శ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు భాసకర్తృత్వ మునుగూర్చి తన సందేహమును వెల్లడించిరి.[4]

శ్రీ కాళిదాసశాస్త్రిగారు చెప్పిన నాలుగుకారణములలో కడపటిదగు 'బాణాది వర్ణితానేక సామాన్యభాసనాటక సంవాదిత్వాచ్చ' యను దాని ననుసరించియు, శ్రీ గణపతిశాస్త్రిగారు భాసనాటకచక్రము ప్రకటించుచు చూపిన లక్షణములను బట్టియు యజ్ఞఫలనాటకకర్తృత్వము భాసునందారోపించుట సహజముగనే యుండును. కాని అది కేవలము స్థూలపరిశీలనముపై ఆధారపడినభావమే. "భాషాయాః అతిప్రాచీన సంస్కృతత్వాత్" అను కారణమంత బలవత్తరముగా దోపదు. 'మహారాజస్య' అనుటకు మారుగ 'మహారాజ్ఞః' (పుట. 23, పంక్తి 6.) యనియు 'మహారాజం'

1. Yajnaphalamu — Tel. Tr. by Bulusu Venkateswarlu. Introduction.
2. S. V. O. I. Journal Vol. XII No. 2 (1951) Pages 83 to 98.
3. Quarterly Journal of Mythic Society, Vol. XXXII. No. 4., Pages 441 & 442.
4. Yajnaphalamu. Tel. Tr. By Sripada Krishnamurti Sastry., Introduction.

అనుటకు బదులు మహారాజానం (పుట 28 పంక్తి 9.) అనియు కొన్ని యపాణి నీయములు — కైకేయి దశరథుని, "మహారాజ ! యనుటకు మారు 'ఆర్యపుత్ర !' (అజ్జఉత్త) యని సంబోధించుట (పుట. 39, పంక్తి 9.) వంటి కొన్ని భరతుని నాట్యశాస్త్రవిరోధప్రయోగములు—కన్పించుచున్నవి. కాని యవి సహజములుగా లేక కృతకములుగా నున్నవి. అందువలన "అతిప్రాచీన సంస్కృతత్వమంతయు కృతకమై"పోయినది.

యజ్ఞఫలనాటకమును సూక్ష్మదృష్టితో పరిశీలించిన నిశ్చితమైన భాసకర్తృత్వాభిప్రాయము పూర్వపక్షము కాగలదు. 'వస్తుకల్పనాయాః శ్రేష్ఠత్వాత్' అనియు, 'రసభావాలంకార నాట్యంగానాం మనోహరతమత్వాత్'అనియు శ్రీకాళిదాసశాస్త్రిగారు చెప్పుటయే కాని వానిని వివరింపలేదు. డాక్టరు పూసల్కరు ప్రభృతులు కూడ గ్రంథము నా దృష్టితో చూడలేదని నా యభిప్రాయము. రామాయణమందలి యయోధ్యారణ్యకాండములకథయు, శ్రీరామ పట్టాభిషేకమును వస్తువుగాగైకొని కిష్కింధాకాండకథయు, రావణవధమును కేవలము సూచించి ప్రతిమానాటకమును, కిష్కింధా, సుందర, యుద్ధకాండముల కథననుసరించి యభిషేకనాటకమును భాసుడు రచించెను. అతడు బాలకాండకథ మాత్రమే వదలుటచే నొక సమర్థుడగు కవి భాసుని పేర ప్రచారమగు తీరున నీ యజ్ఞఫలనాటకమును రచించి, సుగ్రీవ, విభీషణ శ్రీరామపట్టాభిషేకముల యితివృత్తముగల కథకు, "అభిషేకనాటక" మని పేరిడినట్లు —— దశరథయజ్ఞ – విశ్వామిత్రయజ్ఞ – జనకయజ్ఞఫలములు గల బాలకాండ కథాభాగమునకు యజ్ఞఫలనాటకమని పేరిడి సీతావివాహముతో దానిని ముగించెనని నా దృఢవిశ్వాసము. భాసునిభాషననుకరించుటగాని, కొన్ని సామాన్య భాసనాటకలక్షణముల చొప్పించుటకాని సమర్థుడైన కవికి, పండితునకు అసాధ్య విషయములుకావు. కొన్నిటి నపాణినీయముల ప్రయోగించుటయు, కొన్ని నాట్య శాస్త్రవిరోధ విషయములు కల్పించుటయు మాత్రమే రచన ప్రాచీనతకు కాని, భాష ప్రాచీనతకు కాని ఆధారములు కాజాలవని నా నమ్మకము.

అట్టి పని సాధ్యమని తలంపజేయుటకే జయపురవాస్తవ్యులైన పండిత గోపాలదత్తశాస్త్రిగారు 1942 సంవత్సరాంతమున 'భండార్కరు ఇన్‌స్టిట్యూటు'నకు వచ్చినపుడు "యజ్ఞఫలనాటకమును తానే రచించి భాసుడు వ్రాసినట్లు భ్రమింపజేసితి" నని డాక్టరు వి. యస్. సూక్తంకరుగారితోడను, ప్రొఫెసరు పి. కె. గోదేగారి తోడను చెప్పుకొనిరి. తన రచన యని నిరూపించుకొనుటకు గ్రంథములో నచ్చ

యప్పుడు కొన్ని కీలకములనుగూడ నేర్పరచినట్లు నుడివిరి. కాని డాక్టరు పూసల్కరు గారు శ్రీ కాళిదాసశాస్త్రిగారితో సంప్రతించి యది యంతయు శ్రీ గోపాలదత్తశాస్త్రి గారి కృతియని నిరూపించిరి.[1] ఈ క్రిందివిషయములు పరిశీలించినచో నాయభి ప్రాయము సరియైనదిగా విజ్ఞులంగీకరింతురని నా విశ్వాసము.

కాళిదాసశాస్త్రిగారు "వస్తుకల్పనయందలి శ్రేష్ఠత్వము"వలన నీ నాటకమును భాసకృతముగా నిర్ణయించినట్లు తెలిపిరి. ఆ వస్తుకల్పనలోని శ్రేష్ఠత్వము నా కేమియు కన్పింపలేదు. గ్రంథాదినుండి కవి చేసిన సూత్న కల్పనలు - మూలరామా యణమునుండి చేసిన మార్పుల యౌచితిని మూలగాథను యథాతథముగా నుపయో గించుకొన్న తీరును పరిశీలింతము.

స్థాపనలోని సూత్రధారవాక్యమునుండి ప్రథమాంకమునందలి దశరథ సుమంత్రుల సంభాషణమువరకుగల యంశములవలన దశరథయజ్ఞఫలితముగా నైన పుత్రోత్పత్తి సూచింపబడినది. కథాకాలమునాటికి రామాదులజననమై 15 సంవత్స రము లైనది. "ఉత్సవే దానసత్కారే సమ్రాజః పుత్రజన్మని" యను సూత్రధార వాక్యము ప్రకరణమునసుసరించి కుమారుల పదునారవజన్మదినోత్సవము నాటి కర్థమగునేకాని పురుడునకు కాదు. రాబోవువర్ణన మంతయు రామాదుల జన్మ కాలములో జేయదగినంత సంరంభముతో గూడియున్నది. "మహారాజ ఆజ్ఞాప యతి, సర్వే పౌరా జానపదాశ్చ యథేష్టం లబ్ధకామా భవంతు" అనియు, "అధి కరణ ద్వారి యత్ర కుత్ర వా యే సంయతా భవేయుః తే మోచ్యంతామ్ - ఇత్యాదేశః" అనియు కంచుకి పలుకుట ప్రకరణోచితమే. ప్రతివత్సరజన్మదినోత్సవము నాడును అట్టిపనులు చేయుట విశేషముకాదు. కాని సుమంత్రుడు "సమ్రాడేవ సుతోదయేన విహితో ముక్తః పితౄణాం ఋణాత్" అనియు, "పైత్ర్యాదృణా దాస భవాన్వి బద్ధో మోక్షస్తతోఽభూద్భవతస్తు తస్మాత్" అనియు పలుకుట కుమారుల ప్రథమ జన్మదినోత్సవమునకే యన్వయించును కాని ప్రతిసంవత్సరము దశరథుడు పితౄణ ముక్తుడగుట యసందర్భమైనమాట. అంకాంతమున విదూషకుడు దశరథు నుద్దేశించి "కిం పుత్రజన్మదినాత్వం ఋణమోక్షమపి విస్మారితః" అనుటయు పైభావ మునే సూచించును. రఘువంశకాలమున మహాకవి కాళిదాసు వర్ణించిన విధమున కెట్టి పంచపృష్టిద్ధిలేని విలసామకరణము.[2] మఱియొకచోట మువరకుడు "ఆట్య

1. Anthorship of Yajnaphala — Sri R. N. Dandekar — Annals of the Bhandarkar Oriental Research Institute. Vol, XXXI. (1950) Page 307.
2. Raghuvamsa. Canto III St. 20.

ఖలు సఫలం మహారాజస్య పుత్రయజ్ఞకర్మ — తస్మిన్హి యజ్ఞే అహం న మోదకేషు న స్వాతే జఠరే చ సకృపః" అనుటచే ఆనాడు జరిగినది యజ్ఞమో పుత్రజన్మోత్సవమో తెలియుటలేదు. లేక 15 సంవత్సరములకు పూర్వము గడచిపోయిన దశరథుని పుత్రకామేష్టిలో భుజించిన మోదకములను నాడు స్మరించుకొనుచున్నాడనుకొన వలెనా? ఇచట కంచుకితోడి విదూషకుని సంభాషణమున దశరథుని మహారక్షత్వ మపహాస్యమునకు పాలుపరుపబడినది. ఇంత అసంగతముగ సందర్భశుద్ధిలేకుండ భాసుడు వ్రాయడని నా నమ్మకము.

ముగ్గురు రాణులు భర్తృదర్శనము కోరుచు వార్తలనుపుపుట్టము చూడుడు. కౌసల్య " అహం జ్యేష్ఠా పూర్వం సంభావయితవ్యా " అనియు, సుమిత్ర " అహం ద్వయోః కుమార యోః జననీ పూర్వం సంభావయితవ్యా" అనియు, కైకేయి " అహ మేవ పూర్వం సంభావయితవ్యా " అనియు సందేశము భర్తయొద్దకు పంపుదురు. జ్యేష్ఠురాలైనందున కౌసల్య, ఇద్దరు కుమారుల తల్లియైనందున సుమిత్ర; మహా రాజునకు బహుమానపాత్రురాలును, అప్రతిరథుడగు కేకయరాజు దుహితయు నైనం దున కైకేయియు, నెవరికి వారే ప్రథమసంభావనీయులు గానెంచిరి. మున్ముందు రామవనవాసమునకు, భర్తృమరణమునకు గారకురాలు కాబోవు కైకేయివిషయ మున నట్టి యహంభావముతో కూడిన సందేశము గర్హ్యముకాదేమో కాని కౌసల్యా సుమిత్రల విషయమున మాత్రము సందేశమంపురీతి మెచ్చదగినదిగాలేదు. కౌసల్యా సుమిత్రల పవిత్రస్వభావములకే యది విరోధముగానున్నది. చారిత్రకకాలము నాటి దక్షిణనాయకులైన రాజుల యంతఃపురకాంతల స్వభావముల వర్ణించుట కలవాటు పడిన కవి యెవరో దశరథపత్నుల నా స్థాయికి దింపెననవచ్చును. దశరథుడు రాణులనందరను మధ్యమమందిరమున నొకసారిగా తన రాక ప్రతీక్షించునట్లు నుడివిన వెంటనే మంథర స్వగతమే యైనను, " హం న బహుమన్యతే మమ దేవీమ్ " అని కోపప్రకటనము చేయుచున్నది. ఇది అప్రస్తుతము. యజ్ఞఫలనాటకమున ఈ వాక్యార్థమువలని ప్రయోజనములేదు.

మధ్యమమందిరమున తన రాకను ప్రతీక్షింప రాణుల కాజ్ఞాపించిన రాజు ఆనాటే విద్దిష్టస్థలములో వారిని కలిసికొనవలసియున్నది. అది నాటకలక్షణమర్యాద. అట్లు కాకున్న ఆ సూచన కర్థములేకుండపోవును. కాని ప్రథమాంకాంతమున సూర్యాస్తమయమును వర్ణించి ద్వితీయాంకాదిలో దశరథుడు రాణులను, తాను నిర్దే శించిన మధ్యమమందిరమునకాక ధారాగృహసనాథమైన గ్రీష్మోద్యానమున మరు

నాటి మధ్యాహ్నము కలిసికొన్నట్లు వర్ణింపబడినది. అట్టియెడల మధ్యమమందిర మున తొలినాడు సాయంత్రముదాక రాణులు భర్తృదర్శనార్థము వేచియుండి విఫల మనోరథలై మరునాడు మరల తోటలో గలిసికొనునట్లు రాజాజ్ఞను పొందిరనుకొన వలెను. ఇవి నాటకపరిభాషలో దోషములుగా నెంచబడును. దశరథుడు మొదటనే "సర్వాః శ్వః మధ్యాహ్నే గ్రీష్మోద్యానే మమాగమనం పాలయంతు" అని చెప్పి పంపియుండిన సరిపోవును. సామాన్యవిద్యార్థికికూడ లభించు ఇట్టి స్ఖాలిత్యములు భాసుడు చేయునా అని నా సందేహము. దానిని ద్వితీయాంకమందు రాణులు గ్రీష్మోద్యానప్రవేశము చేయునపుడు దశరథుడు, "ఉక్తమాసీన్మయా అద్యాస్మి న్గ్రీష్మోద్యానే సర్వాభిః భవతీభిః ఆగంతవ్యమ్ ఇతి" అను వాక్యముచే పరిహరించు కొనవలెను. లేక రాణులకోరికపై ముందునాడే మధ్యమమందిరమున రాజు వారిని సంభావించి మరునాడు దాయభాగప్రస్తావము దెచ్చెడి తలంపుతో దశరథుడే స్వయముగా రాణులను మువ్వురిని గ్రీష్మోద్యానమున కాహ్వానించెననియైన ననుకొనవలెను.

ప్రతిమానాటకమున కైకేయీపాత్ర ముదాత్తముగ సృష్టింపబడినది. భాసు డచట చేసిన మార్పులు గణింపదగినవి. కైకేయి దశరథుని శాపవృత్తాంతము నెరిగినదగుట పుత్రవిప్రవాసదుఃఖముచే[1] మరణింపవలసిన దశరథునకు పుత్రమర ణమే యతని మరణమునకు కారణముకారాదని శ్రీరామవియోగము వరదానమిషచే గల్గించినది. వృద్ధుడైన దశరథుడెట్లును మరణాపన్నుడై యున్నందున[2] కైకేయి తెలిసియే శ్రీరామునివనవాసము గోరినట్లు కవి కల్పించెను. దానివలన కైకేయి దోషరహితయయ్యెను. ఈ విషయమునే కైకేయి భరతునకు జెప్పుచు రాముని వనవాసపరిమితి పదునాల్గుదివసములనుటకు మారు పర్యాకులహృదయముతో తాను పదునాల్గువర్షములన్నట్లు[3] తెలుపును. కాని యీ సమర్ధనము విమర్శకులకంత తృప్తినీయలేదు. ఇట్లు ప్రతిమానాటకమున కైకేయిశీలము కవి యుద్దేశించినంత నిర్దుష్టముగా పోషింపబడలేదని యందుకొఱకే యజ్ఞఫలనాటకమున ద్వితీయాంకము సృష్టించి యందు కైకేయిని మరింత పవిత్రాశయములు కలదానినిగా చిత్రించెనని కొందర యభిప్రాయము.

యజ్ఞఫలనాటకము భాసకృతమని నమ్మించుటకై దానిని సృష్టించిన కవి యనవసరమైనను ద్వితీయాంకమును రచించెను. ఈయంకమునందలి కథయంతయు

1. Bhasanatakachakra – Pratima. Act. VI. Edited by Sri Devadhar, Page 309, line 10.
2. Valmiki Ramayanam — Ayodhya Khanda. XII. 34.
3. Bhasanatakachakra — Pratima. Act, VI. Devadhar Ed. Page. 309 lines 16 & 17.

కృతకము. రాణులు దశరథునెందుకు జూడగోరిరో తెలుపలేదు. వారితో మాటాడ వలసిన పని తనకున్నట్లు దశరథుడు వ్యక్తపరచును. కాని రాణులను తాను పిలిపించినట్లుకాక వారే తన్ను జూడవచ్చినట్లు నాటకముననున్నది. సీతావివాహముతో ముగియు నాటకమున ఉత్తరకథకేవిధమునను తోడ్పడని దాయభాగప్రసక్తికాని, రామపట్టాభిషేకప్రసక్తికాని యేల రావలెనో యర్థమగుటలేదు. అదియు నెచ్చటనో సందర్భవశమున నొక్కమాటతోకాక దానికొఱకై యొక యంకమే ప్రత్యేకముగ వ్రాయబడుటొకవింత.

ఇట్లు కైకేయిపాత్రమును పోషించుటకై చేసిన ప్రయత్నములో కౌసల్యా సుమిత్రలపాత్రములను కవి మిక్కిలి కృతకములుగా కల్పించెను. దశరథుడు గ్రీష్మోద్యానమును బ్రవేశించుచున్న కౌసల్యను జూచి,

"ధృతమణిరమణీయా జ్యేష్ఠతావాప్తమానా,
బహుకుసుమలతాభా విస్మృతాన్యార్ధ్రాణేయమ్
కథమపి గురుదేహం చాలయంతీ సగర్వా
హృదయమపి మమాంతర్మానయుక్తం కరోతి" (II - 16) యనియు,

"కౌసల్యా మహిషీ జ్యేష్ఠా రామస్య జననీ శుభా
సగర్వా సా భవేత్కామం కింతుమాన్యైవ సర్వదా" (II—19) యనియు

వర్ణించును. ఆమెకు పెద్దరాణిననుగర్వమున్నదనియు, ఇతరుల యోగ్యతల లెక్కింపదనియు, స్థూలదేహమునెట్లో కష్టముతో గదల్చుచు మిక్కిలి గర్వముతో నడయాడుననియు, భర్తయగు దశరథుడే శ్రీరామజనయిత్రిని నిందాగర్భితములైన వ్యంగ్యభాషణములతో వర్ణించుటంత సమంజసముగాలేదు. 'ఆమె సగర్వయే యైనను పట్టమహిషియు, జ్యేష్ఠయు, శ్రీరాముని కన్నతల్లియు నైనందున తనకు మాన్యురాలేనట.

ఇక రాజ్యదానప్రస్తావఘట్టములో కౌసల్య స్వగతములసృష్టి క్షమింపరానంత యసంగతముగానున్నది. కేవలసపత్నీద్వేషము, అధికారకాంక్ష యామెలో గాన్పించుచు విమర్శకులదృష్టిలో కౌసల్యయొక సామాన్యస్త్రీయైనది. ఇక సుమిత్ర కూడ భర్త తన్నభినందించినపుడు,

న మానినీ న వ్యవహారజేత్రీ
న వాక్పటుర్నాఽపి కలిం విధాత్రీ

ధన్యా భవేద్యోషి దవాప్యసాధు -
వాదం సపత్న్యాశ్చ తథైవ పత్యుః. (II—28)

అనుటలో కైకేయీగుణముల నెత్తిపొడుచుధ్వని తెలియనగుచున్నది. సుమిత్ర స్వభావమట్టిదికాదు. కావున కైకేయిశీలమును ప్రతిమానాటకములో తృప్తికరముగా బోషింపలేదని యీ నాటకకర్త అస్థానపతితముగా ఈ యంకమును సృష్టించినా దనుట స్పష్టము. అట్టిప్రయత్నము చేసినవారు లేకపోలేదు. రాజశేఖరుని బాల రామాయణములో, శూర్పణఖాసర్వమాయులు, కైకేయీదశరథుల మాయారూప ములు ధరించుట, రాముని వనవాసగమనమునకై వారు యుక్తులు పన్నుట, కేవలము కైకేయీ దశరథులను జననిందనుండి తొలగించుటకు కవి జేసిన ప్రయ త్నములనుటలో సందేహము లేదుకదా![1] యజ్ఞఫలములోని ద్వితీయాంకకథాకల్ప నమునకు వాల్మీకిరామాయణములో దశరథుడు కైకేయితో,

నను తే రాఘవ స్తుల్యో భరతేన మహాత్మనా

బహుశోహి సుబాలే త్వం కథాః కథయసే మమ.[2] యనుటయు, కైక మంథరతో, 'రామే వా భరతే వా హం, విశేషం నోపలక్షయే'[3] యనియు, "రామో రాజ్ఞ స్సుతో జ్యేష్ఠో యౌవరాజ్య మతోర్హతి"[4] యనియు వాదించుటయు నాధారములని స్పష్టముగా దెలియుచున్నది. సీతావివాహమునకు పూర్వమే శ్రీరామ యౌవరాజ్యపట్టాభిషేకప్రసక్తి వచ్చుటకు తగిన యాధారములు వాల్మీకీయమున లేవు. తరువాతనైతము దశరథునకాభావము ఆకస్మికముగా కలిగినదేగాని ముందుగా నందరతో నాలోచించి చేసినదికాదు. తనకు దుస్స్వప్నములు కలుగుచున్నవనియు, అవి తన మృతిని సూచించుచున్నవనియు, కావుననే పట్టాభిషేకము మరునాడే జరుగవలయునని దశరథుడు శ్రీరామునితోడనే చెప్పియున్నాడు.[5] మామగారి యింటినుండి భరతుడు వచ్చుటకు పూర్వమే ఈ కార్యము ముగియవలెననియు విశదముగా చెప్పియున్నాడు.[6] కావున యజ్ఞఫలనాటకములోని రాజ్యభాగప్రసక్తి సందర్భశుద్ధిగా లేదు. అది యచ్చట యప్రస్తుతము. భావికథాగమనమునకు తోడ్పడని కల్పనము నిరర్థకమైనది.

1. Balaramayana by Rajasekhara. Act VI.
2. Valmiki Ramayanam. Ayodhyakanda; XII; 21.
3. Valmiki Ramayanam. Ayodhyakanda; VII; 35.
4. Valmiki Ramayanam. Ayodhyakanda; VIII; 14.
5. Valmiki Ramayanam. Ayodhyakanda; IV; 17 to 20.
6. Valmiki Ramayanam. Ayodhyakanda; IV; 25 to 27.

ప్రథమాంకములో వలెనే యిచ్చటను విదూషకుని సంభాషణము వెగటు గొల్పుచున్నది. ఈ సన్నివేశమంతయు కృతకసృష్టి. కాళిదాసుని శాకుంతలములో దుష్యంతుడు మాధవ్యునితో శకుంతలను గూర్చి యన్న శ్లోకార్థమును మనమున నుంచుకొని యీ దృశ్యము రచింపబడి యుండును. "అద్యమయా జ్ఞాతం భరతాయ ప్రతిశ్రుతంరాజ్యం వయస్యో రామాయ దాస్యతి. అహమంతఃపురే దేవీనాం, బహిశ్చ భ్రాతౄణాం, విగ్రహముత్పాదయామి" అను విదూషకవాక్యముల కాధారము దశరథు డతనితో "రామో వా భరతో వా యఃకోపి రాజ్యంలభేత" యను వాక్యమే. ఆవసరములేనిచోట దశరథునినోట అట్టి వాక్యము పలికించుట యొకదోషము. భరతునకు రాజ్యము ప్రతిశ్రుతమన్న విషయము విదూషకునకు గూడ తెలియదగినంత బహిరంగరహస్యముగా కల్పించుట మరియొకదోషము. ఈ రెండును రచనయందలి కృతకత్వమును నిరూపించుచున్నవి. ఈ కథయంతయు కౌసల్యయే విదూషకునితో జెప్పివదనుకొనవలసినదే. దశరథు డంతతోనే భయపడి "మూఢోత్పాదితోపి క్షోభః శంకాం జనయతి" యని తలంచి "సఖే సుందరక ! కథాప్రసంగేనైవాద్య రాజ్యదాయ విచార ఉద్భూతః ॥ నకిమపి కస్యాపి వచనం యథార్థం మన్యస్వ".

క్వ నృపత్వమనల్పవిప్లవమ్
క్వ కుమారాః సుకుమారచేతసః,
పరిహాస విజల్పితం త్విదమ్
పరమార్థం నహిమన్యతాం వచః.[1] (II—41)

అని పలికి తప్పించుకొన జూచుచున్నాడు. ఈ నాటకమునందంతటను విదూషకుని వలన మోదకభక్షణపాండిత్య ప్రయోజనము తప్ప తదితరములేదు.

ద్వితీయాంకాంతముననే రామునకనిష్టము నాపాదింప సంకల్పించి రావణుడు అయోధ్యానగర పరిసరములలో దిరుగుచున్నాడను సూచన యీయబడినది. దాని ననుసరించియే తృతీయాంకాదిలో రావణుడు రామాది కుమారుల ధనుర్వేదాభ్యాస కాలమున సన్నిహితుడై యున్నట్లు కల్పింపబడినది. మూలాను సరణముకాక పోయి నను రావణునకు రామునిశక్తిసామర్థ్యముల పరిమితి తెలిసికొనుట కొక యవకాశ మును కవి కల్పించినాడు. నాటకములోని తరువాతి కథలో ఈ సన్నివేశము వలని ప్రయోజనము ప్రత్యక్షముగాలేక పోయినను, తాటకామారీచసుబాహుల ప్రతారణము నకు, శివధనుర్భంగమునకు దగినంతశక్తి రామునకున్నదని తెలియజేయుట యందు కన్పించుచున్నది.

1. Abhijnana Sakuntalam — Act II; ver. 18.

ధనుర్వేదాభ్యాసకాలమున శ్రీరాముని శీలమునకు కొంత మచ్చయేర్పడినదనియే చెప్పవచ్చును. దానికి కారణము రావణుని విపరీతప్రవర్తనము. వాల్మీకీయమున రావణుడు అయోధ్యాప్రాంతములకు వచ్చినట్లులేదు. దశరథుని సభలో మొదటిసారి రావణప్రసక్తి విశ్వామిత్రుడు యాగరక్షణార్థము రామలక్ష్మణుల సహాయము వేడ వచ్చినప్పుడే తెచ్చును. మారీచసుబాహులు యజ్ఞవిఘ్నమునకై రావణునిచే బంప బడిరని తెల్పుచు రావణచరిత్రమును విశ్వామిత్రుడే వివరించును.[24] కాని రామ రావణులకు వైరమురాగలదను సూచన అప్పటికి రాలేదు. రావణుడు అయోధ్యా ప్రాంతములకు శ్రీరాముని పరాక్రమమును పరీక్షించుటకై వచ్చినట్లే యజ్ఞనాటక మున "రామోనామ మహీపతే ర్దశరథస్యాత్రాత్మజః............అత్రాగతోఽహం ద్రుతమ్" (III—6) అను పద్యముచే దెలియుచున్నది. బలవంతుడైన వానిని స్వయముగా యుద్ధమున కాహ్వానించి యెదిరించు అలవాటుగల రావణుడు దొంగవలె బాలుడైన రాముని పరాక్రమము బరీక్షింపదలంపనేలనో యర్థముకాలేదు. వీడైన చంపుటకే యని శత్రుభావముతో వచ్చినట్లే "లబ్ధోభవే త్కథమపి............బంధం వధం యదుచితం విదధేఽథ మోక్షమ్" (III—7) అను పద్యము తెలుపును. కాని విశ్వామిత్రు నితోపాటు రావణుడును స్వగతముగా శ్రీరాముని "వ్యూఢోరో దధదున్నతాంస.... ధరణీమవాతరదహో దేవోఽచ్యుతో దైత్యహా" (III—27) యని వర్ణించినట్లు గ్రంథ మున గలదు. చంపదలచిన శత్రువునట్లు కీర్తించుట రావణుని వంటివాడు చేయదగిన పనికాదు. ఒకవేళ సనత్కుమారునియొద్ద విష్ణువే శ్రీరాముడుగా నవతరించి తనకు మోక్షమొసగునని యెఱిగినవాడౌట[25] రాముని శత్రుత్వమును శీఘ్రముగా సంపా దించుటకై దుష్టకార్యములు సేయుచు శ్రీరామదర్శనమును పొంది యట్లు కీర్తించి నాడందమన్న తత్పూర్వోదాహృత శ్లోకార్థ మాభావమును బాధించును. కావున పైపద్యము కేవలము విశ్వామిత్రుని సంకీర్తనభాగమే యనుకొనవలెను. "కిం వాయవ్యాస్త్రసంహారోఽపి మయాకర్తవ్యః। తథైవాస్తు (నిష్క్రాంతౌ)" అనుచోట కూడ విశ్వామిత్ర రావణులు కలిసియే యున్నట్లు ముద్రితప్రతిలో గలదు. అర్థమును బట్టి యది రావణవాక్యము మాత్రమే యని తెలిసికొనవచ్చును. ఈ రెండుచోట్లను గ్రంథప్రకాశకులు పొరపడిరేమో యనియు ననుకొనవచ్చును.

శ్రీరాముడు వృక్షమునగల పత్రముల జిల్లులుపడగొట్టుటకై బాణముప్రయో గింప నది యదృశ్యరూపుడైన రావణునిచే ఖండితమగును, రెండవసారి కోపముతో

24. Valmiki Ramayanam — Balakanda; XX; 15 to 19.
25. Valmiki Ramayanam — Uttarakanda; Adhikapatha; VIII; 18, 19.

వదలిన బాణమునునట్లే యగును. మూడవసారి వాయవ్యాస్త్రము ప్రయోగింప రావణుడు దానినిగూడ ఉపసంహరించును. శ్రీరాముడు బాణప్రయోగముచేసి లక్ష్య భేదనము చేయలేక మూడుమారులు విఫలప్రయత్నుడగునట్లు వర్ణించుటచే గవి శ్రీరాముని కీర్తిప్రతిష్ఠలకు భంగమువాటిలజేసిన వాడయ్యెను. కడకాగ్నేయాస్త్రమును మహోగ్రుడై ప్రయోగించుచు ఆ బాణము " వృక్షమును సమూలముగా బక్షులతో గూడ గాల్చివేయుటయో అట్లుకాకున్న తన శరీరమునే భస్మముచేయుటయో జరిపి తీరవలె" నని ప్రతిజ్ఞసేసి సంధించును. రావణుడు భయమునటించి లంకానగరాభి ముఖుడై పారిపోవును. వెంటనే భరతుడు " నఖలు నఖలు వధ్యాః పక్షిణోఽనాగసస్తే ............క్వవున రశనికల్పామృత్యు దూతాః శరాస్తే " (III—38) యని శ్రీరాముని నివారించును. ఈ పద్యము కేవలము కాళిదాసుని శాకుంతలములోని " నఖలు నఖలు బాణః సన్నిపాత్యోఽయ మస్మి న్మృదుని మృగశరీరే పుష్పరాశావివాగ్నిః[1] అను పద్యమున కనుకరణము. లేనిచో సమంత్రకము, సప్రతిజ్ఞాకమునగు శ్రీరాముని యాగ్నేయాస్త్రమునకు ఉపసంహారమేమి ? చెట్టుపై పక్షులున్నవని శ్రీరాముడెరిగియే కదా ప్రయోగించెను. దీనికంటె విపరీతమైన విషయము వెంటనే యున్నది. ఆగ్నే యాస్త్రము నుపసంహరించి రాముడు " వాయవ్యాస్త్రేణ తాం మహతీం శిలాం దూరం క్షిపామి " యని ప్రయోగింప నా బాణమును వ్యర్థమగుచున్నది. ఇప్పుడు రావణుడు లేడు. లంకానగరాభిముఖుడై వెళ్ళినట్లును. వాని పలాయనము గనిపెట్టుటకై విశ్వా మిత్రుడు వెంట నేగినట్లును ముందే వర్ణింపబడినది. కాని యిప్పుడీ వాయవ్యాస్త్రము విఘ్నమగుటకు కారణములేదు. పోనిండు రాబోవు వశిష్ఠునిలో లీనమైనదనుటకు— ఎదుటనున్నవారు మంథరాది స్త్రీజనము కాని వశిష్ఠుడుకాడు. ఏదో అదృశ్యశక్తి యున్నదని యనుమానించి భావగామి బాణముప్రయోగించినప్పుడే వశిష్ఠుడు వచ్చు టయు రాముడాబాణమును ఉపసంహరించుకొనుటయు జరుగును. ఇచ్చట " రామ బాణము " అన్నిచోట్ల వ్యర్థమైనది. తనంత తాను వ్యర్థమగుటయో ఉపసంహరించు కొనవలసిన పరిస్థితులలో ప్రయోగింపబడి వ్యర్థమగుటయో జరిగినది, అయ్యో రామునియవస్థ ! అతని ధానుష్కతకెట్టి దయనీయమైనస్థితి యేర్పడినది !

ఈ సన్నివేశమున మంథరా పాత్రప్రయోజనము శూన్యము. అర్థరహితము కూడ. ఉత్తరకథకేమాత్రమును తోడ్పడక పోవుటయే కాక వెగటుగొల్పుచున్నది. మంథర, చతురిక మున్నగు దాసీజనము సాధించిన ఘనకార్యము అచ్చట అదృశ్య

1. Abhijnana Sakuntalam — Act I; Sl. 10.

శక్తియేదో ఉన్నట్లు గుర్తించుటమాత్రమే. అప్పుడు కాని రామాదులకామాత్రము తోపక పోయినది.

అట్లే పంచమాంకాదిలో తామ్యాయన పాత్రమును వ్యర్థము. అతని గురు నింద, గురుకులవాసనిరాసనము అర్థరహితములు. అప్రస్తుతములును. దానిని కవి హృదయముగా భావింతమన్న భాసుని రచనలలో నన్నిటను ప్రాచీనఋషుల పద్ధతుల యందపూర్వగౌరవభావము విశదమగుచుండ నిచ్చట నింత నీచముగా గురువుల స్వభావమును భాసుడు చిత్రించునా ? దీనిని బట్టియే భాసు ననుకరింపదలచిన వారెవ్వరో యీ రహస్యమును మఱచి తమ వ్యక్తిత్వమును బయల్పరచుకొనిరని యూహింపవచ్చును.

భాసుడు ప్రతిమానాటకమున స్పష్టముగా భరతునకన్న లక్ష్మణునే వయోజ్యేష్ఠుడుగా వర్ణించినాడు. సుమంత్రునితో గూడ భరతుడు దండకావనగతుడైన శ్రీరాముని దర్శనార్థము వచ్చి నప్పుడు ముందుగా నెదురువచ్చిన లక్ష్మణుని జూపి సుమంత్రుడు "అయే కుమారో లక్ష్మణః" అనగా భరతుడు "ఏవం, గురురయమ్ః ఆర్య అభివాదయే" అని లక్ష్మణునకు నమస్కరించుచున్నాడు. వెంటనే లక్ష్మణుడు "ఏహ్యేహి ఆయుష్మాన్ భవ !"[1] యనుటచే లక్ష్మణుని జ్యేష్ఠత్వమును భాసుడుద్దేశించినట్లు స్పష్టము. వెంటనే లక్ష్మణుడు భరతునుద్దేశించి "కుమార ! ఇహతిష్ఠ ! త్వదాగమన మార్యాయ నివేదయామి"[2] అనుచున్నాడు. ఇచ్చట "కుమార" యను సంబుద్ధియు స్పష్టముగా భరతుని కనిష్ఠత్వము సూచించుచున్నది. వాల్మీకి రామాయణమున భరతుడే లక్ష్మణునకంటె పెద్దవాడని విశదముగా వివరింపబడి యున్నది. శ్రీరాముడు చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రమున కర్కాటలగ్నమందు జన్మించెను.[3] భరతుడు పుష్యమీ నక్షత్రమున మీనలగ్నమందును లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషా నక్షత్రమందు కర్కాటలగ్నమునను జనించిరి.[4] ఇట్లు భరతలక్ష్మణులిరువురును దశమినాడే జన్మించినను జనించిననక్షత్రములబట్టి భరత జ్యైష్ఠ్యము స్థిరపడినది.

ప్రతిమానాటకమున స్పష్టముగా లక్ష్మణజ్యైష్ఠ్యమునంగీకరించిన భాసుడు యజ్ఞఫలనాటకమున భరతుని జ్యైష్ఠ్యమును సువ్యక్తమొనర్చినాడు. రెండునాటకముల నొక వ్యక్తియే రచించియుండిన నిటి పొరపాటు రాగలదా.

1. Bhasanatakachakram — Pratima Act IV;
2. Bhasanatakachakram — Pratima — Act IV.
2. Valmiki Ramayanam — Balakanda —XVIII; 8, 9.
4. Valmiki Ramayanam — Balakanda — XVIII; 14, 15.

యజ్ఞఫలనాటకమున నాల్గుసందర్భములలో భరతలక్ష్మణుల యందెవ్వరు జ్యేష్ఠులో నిర్ణయింప ననువగు సూచనలున్నవి. వీనిలో రెండు భరతజ్యైష్ఠ్యమును తక్కిన రెండు లక్ష్మణజ్యైష్ఠ్యమును సూచించును. భరతజ్యైష్ఠ్యమును సూచించు సందర్భములే బలవత్తరములుగా నున్నందున నీ నాటకమున కవి భరతజ్యైష్ఠ్యము నంగీకరించెనని యొప్పుకొనవలయును. మొదటి మంగళశ్లోకములో "రామః కృపాయా భరతో మనోజ్ఞః, పాయాత్సచాపః శుభలక్ష్మణ శ్చ శత్రుఘ్నవీరో" అనుచో వాల్మీకీయములోని జన్మక్రమము వివరింపబడినది. ఇచ్చట భరతుడే జ్యేష్ఠుడనుట సూచితము. అట్లే సప్తమాంకమున కుమారుల వివాహవర్ణనమున "తతశ్చ రామ తుల్య గుణాన్ రామస్యాత్మ భాగానివ భరతలక్ష్మణశత్రుఘ్నాన్ ఆయుష్మతీనాం మాండవ్యూర్మిళా శ్రుతకీర్తీనాం స్వామినోఽభావయమ్" అనుచో క్రమముగా భరతుడే జ్యేష్ఠుడనుట వ్యక్తపరుపబడినది. వాల్మీకీయములో రాముని వివాహానంతరము లక్ష్మణుని వివాహ మూర్మిళతోనైనట్లును,[1] తరువాత భరతశత్రుఘ్నుల వివాహములైనట్లును వర్ణింపబడినది.[2] ఈ సందర్భమున గోవిందరాజీయము జ్యేష్ఠుడైన జనకరాజర్షి దుహితల వివాహములు ముందును తమ్ముని తనయల వివాహములు వెనుకను జరుపుటచే భరతుని వివాహమునకంటె లక్ష్మణుని వివాహముముందు జరుగుటలో దోషములేదని సమర్థించెను.

తృతీయాంకమున కుమారుల ధనుర్విద్యాభ్యాస సమయమున వారు బాణ ప్రయోగముచేసిన క్రమము లక్ష్మణజ్యేష్ఠత్వము సూచించుచున్నది. కవి చెప్పక పోయినను కనిష్ఠాను క్రమముగా వారు బాణప్రయోగముచేసినట్లు స్పష్టము. శత్రుఘ్నుడు "భో భోః పశ్యత..........సత్వరమిమం బాణం విషగే తథా" (III — 18) యని ప్రయోగించిన వెంటనే భరతుడు "దీర్ఘాయుషా..........తథైవ విదధామ్యహమ్" (III — 19) అని ప్రయోగించును. పిదప లక్ష్మణుడు "సమూల ముత్పాట్య..........కృతస్వకార్యః పునరేతి తూణమ్" (III – 20) అని బాణప్రయోగము చేయును. వెంటనే భరతశత్రుఘ్నులు "అహో అద్వితీయం బాణక్షేప కౌశలం మహాభాగస్య" యని ప్రశంసింతురు. ఇచ్చట మహాభాగశబ్దప్రయోగము లక్ష్మణ జ్యేష్ఠత్వమునే సూచించును. కాని వాల్మీకీయమున దశరథుడు భరతుని మహాత్ముడనియు, భరతుడు లక్ష్మణుని మహాత్ముడనియు ఉల్లేఖించిన సందర్భములు పెక్కులున్నవి.[3] కావున శత్రుఘ్నుని వెంటనే భరతుడు బాణక్షేపము నేయుట కాని,

1. Valmiki Ramayanam — Balakanda — Sarga 73, Sl. 29.
2. Valmiki Ramayanam — Balakanda — Sarga 73, Sl. 30, 31.
3. Valmiki Ramayanam — Ayodhyakanda Sarga 12, Sl. 21. and Sarga 70. Sl. 7.

శత్రుఘ్నునితో కలిసి భరతుడు లక్ష్మణుని 'మహాభాగు' డనుట కాని నిర్వివాదముగా లక్ష్మణుని జ్యేష్ఠత్వమును స్థాపింపజాలవు. రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులను వరుసగా జెప్పినదే కవి భరతుని జ్యేష్ఠత్వము నంగీకరించె ననవచ్చును. ఇరువురు మువ్వురు వ్యక్తులనుద్దేశించినప్పుడు వారిలో గొందర కన్వయించు నర్థమును అందరి కన్వయించునను కొనరాదు. లక్ష్మణుని ప్రక్కనున్న సుగ్రీవ విభీషణులకు నమస్కరించినపుడును,[1] అట్లే లక్ష్మణునికి దగ్గరలోనున్న సీతాదేవికి నమస్కరించినపుడును భరతుడు[2] లక్ష్మణునకు నమస్కరించెనను కొనరాదు కదా!

పై విషయములనన్నిటిని సూక్ష్మముగ పరిశీలించినచో ప్రతిమానాటకమున లక్ష్మణ జ్యేష్ఠత్వమును యజ్ఞఫలనాటకమున భరతజ్యేష్ఠత్వమును కవి యుద్దేశించినట్లు తెలియుచున్నది. ఏకకర్తృకములైన నాటకములు రెండింటిలో నిట్టి వ్యత్యయములుండ జాలవు. దీనిని బట్టియే యజ్ఞఫలనాటకకర్త భాసుడుకాడని యూహింపవచ్చును.

సీతా వివాహఘట్ట మీ నాటకమున పెక్కువింతలతో గూడుకొనినది. వాల్మీకీయమున శివధనుర్భంగమునకుమున్ను శ్రీరాముడు సీతను జూచినట్లులేదు. సీతారాములవంటి కారణజన్ములకట్టి వివాహాత్పూర్వ సమావేశము లనభిలషణీయములు. భాసునికాలమునాటికి ప్రేమవివాహముల ప్రసక్తి పురాణపురుషుల విషయమునలేదు. ప్రతిజ్ఞా యౌగంధరాయణమున వత్సరాజు చారిత్రక పురుషుడు. కాబట్టియే యతడు వాసవదత్తను ప్రేమించి[3] పెండ్లియాడుట జరిగినది. కురంగి, అవిమారకులగాథయు నట్టిదే. కాని భాసుడుకాని తత్పూర్వులుకాని ప్రేమవివాహములజోలికి పోలేదు. సుభద్రార్జునుల వివాహము నలదమయంతుల వివాహము దీనితో బోల్పరాదు. సుభద్ర అర్జునునకు మేనమామకూతురు. నలదమయంతులు పరస్పరము చూచుకొన్నవారే కాదు. వినుకలిపై వారిప్రేమ వర్ధిల్లినది. అంతే కాక వరునెన్నుకొను అధికారము దమయంతికే యీయబడినందున దాన దోషములేదు. ఇచ్చట వరునెన్నుకొను నధికారము సీతకులేదు. శివధనురారోప మెవడు కావించునో యతడే సీతకుభర్త. అట్టిచో కారణజన్ములైన వారిరువురకు ఉద్యానవనములో వివాహాత్పూర్వసమావేశము కల్పించుట భాసునికాలమునాటికి క్రొత్త. తరువాత కొన్నివందల సంవత్సరములకు కాని యా భావము కవులకు దోపలేదు. జయదేవుడు తన ప్రసన్నరాఘవ నాటకములో[4] సీతారాములనొక యుద్యానవనమున గూర్చినాడు. అట్లే భవభూతి

1. Raghuvamsam. Sarga 13; Sl. 72.
2. Valmiki Ramayanam. Yuddhakanda. Sarga 130. Sl. 41.
3. Bhasanatakachekram — Pratijna Yaugandharayanam. Act III.
4. Prasannaraghavam of Jayadeva — Act II.

తన మహావీరచరితము నందును. వారి కిరువురకు యజ్ఞదర్శనవ్యాజమున విశ్వామిత్రాశ్రమముననే[1] పరస్పరసందర్శనము ఘటింపజేసినాడు. అట్లే అరవమున కంబర్ మహాశయుడు వ్రాసిన రామాయణములో[2] మిధిలానగరరాజవీధిలో నడచి చనుచున్న రాముడు అంతఃపురవాతాయన మార్గమున గన్పించు సీతను జూచినట్లును, అప్పుడే సీతయు రాముని జూచినట్లును వర్ణించి వారు పరస్పరము ప్రేమదృష్టులు పరపుకొన్నట్లు వివరించియున్నాడు. ఇట్లే మరికొందరు భాసునికి తరువాతివారు చేసియున్నారు. కాని యజ్ఞఫలములోని కల్పనము చాలకృతకముగాగన్పట్టుచున్నది.

షష్ఠాంకమున ముష్టిక, స్థూలాంస దీర్ఘబాహుల సంభాషణములవలన జనక విశ్వామిత్రులు మాటాడుకొనియే సీతారాములకు తోటలో కలిసికొనుట కవకాశము కల్పించిరని తెలియుచున్నది. ఇంతకంటె ఘోరమేమున్నది. చూడుడు.

స్థూలాంసః :— అస్మాకం మహారాజస్య దుహితరం సీతా మత్రోద్యానే (రామః) చిరం పశ్యతి.

ముష్టికః :— పూర్వం లక్ష్మణః ఛాయేవ తమనుగత ఆసీత్. సాంప్రతం విశ్వామిత్రః త ముపదేశాపదేశేనాన్యతోనయతి, రామం చ ఉద్యానేముంచతి.

స్థూలాంసః :— అస్మాకం రాజదారికాపి విటపాంతరి తా భూత్వా చిరం తమేవ పశ్యతి.

ముష్టికః :— యది మహారాజస్యా నుమతం భవే త్తర్హి శీఘ్రమేతయోర్వివాహో భవేత్.

దీర్ఘబాహుః :— యది నభవిష్యతి ద్వావ ప్యున్మత్తౌ భవిష్యతః.

ముష్టికః :— కిం మహారాజో విశ్వామిత్ర శ్చ జానీత ఏతత్.

దీర్ఘబాహుః :— జానీతః ! అతఏవ తయోరేకాంతే దర్శన మనుమతం భవేత్. (VI — ప్రవేశకము)

ఈ సంభాషణము కవియెందుకు కల్పించినట్లు ? సామాజికులకు ఆ రహస్యము తెలుపుటకే కావి సేవకుల యర్థరహితప్రలాపములిట్టివవి నిరూపించుటకు కాదు. అట్లైన ' ప్రవేశకము ' వలవి ప్రయోజనమే చెడును. నిజముగా జనకవిశ్వామిత్రు లిట్టి సన్నివేశమే కూర్పదలచినచో నిక శ్రీరాముడు విష్ణువనుట సీత లక్ష్మియే యనుట పొల్లగునే కదా. రూపాంతరములమున్న లక్ష్మీవిష్ణువులకు సమాగమము పరులు ప్రయత్నించి కూర్పవలసిన యవస్థ యెందుకు రావలయును ? శివధనురారోపణ పణ మొకవ్యాజమును రాముని యప్రతిమాన భుజబలప్రదర్శకమును మాత్రమే.

1. Mahaviracharita of Bhavabhuti. Act I.
2. Kamba Ramayanam — Mithiladarsana Patalam Verse. 157.

రాముని విరహవేదన సామాన్యరాజకుమారుల విషయమున వర్ణింపబడిన తీరుననున్నది. శ్రీరాముడు సీతనుజూచి, "దృష్టం మయాప్యస్యాద్యాన్యత్వ మివ! కస్యాపి బ్రహ్మర్షేర్దుహితా భవంతీయం మమాగమ్యా వా స్యాత్! అన్యవధూర్పవిత్రీ వా దుష్ప్రాపా భవేత్। తదా వ్యర్థమేవ మయా రామేణాస్యాం మనో నిహితమ్। నైవం భవిష్యతి! ఇయం హి."

నైవాగమ్యా న దుష్ప్రాపా యన్మనోమేత్ర ధావతి,<br>
కృత్యాకృత్యవివేకేతు ప్రమాణం హి సతాం మనః. (VI—18) అని

తలంచుట కేవలము శాకుంతలములోని దుష్యంతునివాక్యమును [1] పోలియున్నది. ఆ సన్నివేశమును మనమునసుంచుకొనియే యజ్ఞఫలనాటకకర్త దీనిని సృష్టించె ననుకొనుట యంత త్రోసివేయదగినభావము కాదని నా తలంపు. ఇచ్చట మధురిక శివధనురారోపణపణమునకు భయపడుచున్న సీతతో, "యథా రామస్య రమణీయా కృతిః స బల వా న పి నతత్కరిష్యతీతి నిశ్చితమ్"అనుట యెంత ఘోరము; ఎంత యమంగళము. ఆపదలోనున్న చెలినోదార్చుమాటయేనా అది. కాని యీవాక్యము బుద్ధిపూర్వకముగా కవి కల్పించినాడనుట స్పష్టము. ఆ వెంటనే సీత మూర్ఛిల్లుట, చంద్రకళ సహాయార్థ మాక్రోశించుట, శ్రీరాముడు తొందరగా ప్రవేశించి, "నభేతవ్యం! ఇయం మమ ప్రియా-కథం" అని యర్ధోక్తిలో నాపి క్రమముగా సీతాజన్మవృత్తాంతము దెలిసికొనుట ఆ కల్పనవలని ప్రయోజనము. ఇదియు కేవలము కాళిదాసున కనుకృతియే. కాని కల్పనముమాత్ర మంత యుదాత్తముగా లేదు. మధురిక సీతనుద్దేశించి, "యథా రామేణవినా త్వం సంతప్తా తథైవ రామోపి త్వయా వినా సంతప్తః" యనగా, సీతయు "అపేహి! ఆర్యపుత్రస్యనామకథయసి" యనుచున్నది. వివాహాత్పూర్వమే కన్య తాను ప్రేమించినవానిని "ఆర్యపుత్రు" డను పారిభాషికపదముతో సూచించుట నాకు క్రొత్త. అట్టి ప్రయోగము లేదనియే నా నమ్మకము. అట్లు పిలువరాదను సూచన కాళిదాసుని శాకుంతలమున గలదు.[2]

అంతలోనే యుద్యానమున బ్రవేశించిన జనకమహారాజు సీతతో ఆసన్న వివాహసూచనచేసి, వారి నిష్క్రమణానంతరము "ఇతః షష్ఠేఽహని మమ సత్రాంత స్నానం తదార్షేణ విధినా సీతాం రామాయ దాస్యామి" యని నిశ్చయించి,

"సీతానురాగో దృఢ ఏవ తస్మిన్<br>
సచాపి తాం కామయతే కిమన్యత్" (VI—39)

అను వాక్యముచే సీతారాముల పరస్పరప్రేమము తాను మున్నే గుర్తించినట్లు

1. Abhijnana Sakuntalam Act I. S1. 20.
2. Abhijnana Sakuntalam Act V.

ప్రకటించును. ఇట శివధనురారోపణప్రసక్తియేలేదు. ఈనిశ్చయమునకుతరువాతనే యా ప్రసక్తివచ్చును. అంతేకాక ధనురారోపణమునకు పూర్వమే దశరథాదులకు ఆహ్వానములు వెళ్ళను చూడుడు. జనకుడు, "మమ పరమః సఖా మహారాజో దశరథో ...................... సహాగచ్ఛత్వితి" యని సందేశమంపుటయే కాక,

"దృష్ట్వా చిరాద్దశరథం సుహృదం గృహే మే
తస్యాత్మజాయ తనయాం విధినా ప్రదాయ
యూనోః సమానగుణయోశ్చ విలోక్య యోగమ్
లబ్ధా మనో మమతదా పరమాం ప్రసత్తిమ్" (VI—42)

యని ప్రకటించును. దీనివలన శ్రీరాముడు శివధనురారోపణము చేసినను చేయలేకున్నను కూడ సీత నతనికిచ్చుట నిశ్చయమన్నంత దృఢముగా జనకుడున్నాడు. ఇది వాల్మీకీయమునకు కేవలము విరుద్ధము.

యజ్ఞఫలనాటకమున కవి చేసిన మార్పులవంటి వాని నెవ్వరును చేయరని కాదు. ఇంతకంటె విపరీతమైన మార్పులుచేసిన కవులున్నారు. భాసుడే ప్రతిమాదులందు చాల మార్పులు చేసియున్నాడు కాని వానివలన పెక్కు ప్రయోజనములను సాధించియున్నాడు. యజ్ఞఫలమునందలి మార్పులన్నియు కృతకములనియు, పరానుసరణములనియు వివరించుటయేనా ప్రయత్నము. అందువలననే అట్టి ప్రయోజనశూన్యములు అర్థరహితములు నయిన మార్పులు భాసుడు చేసియుండడనియు, నాకారణముననే యజ్ఞఫలమును మరెవ్వరో వ్రాసి దానిని భాసుని దనిపించుటకై భాసనాటకలక్షణముల గొన్నింటి నందు ప్రవేశపెట్టిరనియు నెంచవచ్చును. సీతారాముల వివాహమునుబట్టి రసము శృంగారమనుకొనవలయును. దానికి క్రమపోషణము లేదు. భావములు, అలంకారములు కాళిదాసాదుల కనుకరణములే కాని స్వకీయములు చాల తక్కువ.

శివధనుర్భంగసూచన సీతావివాహమునకుపూర్వము రాలేదు. సీతావివాహము జనకయజ్ఞఫలమే కాని శివధనురారోపణము నిమిత్తమాత్రమైనది. ధనుర్భంగ విషయము పరశురాముని,

"శైవం ధనూ రామబలేన భగ్నమ్
శ్రుత్వా జవే నైమి తపో విహాయ" (VII—13)

యను పలుకుల వలనను, శ్రీరాముని

"నాతతస్య చిరాత్తస్య ............ తద్విధాభవత్" (VII—14)

అను మాటల వలనను దెలియవచ్చుచున్నది. అదేసూచన యే ప్రవేశకవిష్కంభకముల మూలముననో సప్తమాంక ప్రారంభముననే చేసియుండిన నెంతో యుక్తముగ నుండెడిది.

ఇక యజ్ఞఫలనాటకములోని ప్రాకృతమునుగూర్చి కొంచెము చర్చింపవలసి యున్నది. భాసనాటకచక్రములోని తక్కినవానిలో ప్రాకృతమంతయు నొకవిధము గనే యున్నది. దానికి సంస్కృతచ్ఛాయ మాత్రమే శ్రీ గణపతిశాస్త్రిగారు వ్రాసి నట్లు[1] చెప్పియున్నారు. యజ్ఞఫలనాటకములోని ప్రాకృతము తక్కినవానిలోని ప్రాకృతమునకంటె భిన్నమైనది. "ఆర్యపుత్ర" శబ్దమునకు యజ్ఞఫలమున "అజ్జ ఉత్త" యనియు తక్కినవానిలో "అయ్యఉత్త" యనియు నున్నది. అట్లే "రావణ" శబ్దమునకు యజ్ఞఫలమున "రావణ" యనియు తక్కినవానిలో "ళావణ" యనియు నున్నది. "ర్య" 'ర, ల'ల విషయమునను, మఱి పెక్కింటివిషయ మునను యజ్ఞఫలమునందలి ప్రాకృతము, తక్కిన రూపకముల ప్రాకృతమునుండి భేదించుచున్నది ఇంకను సూక్ష్మముగ బరిశీలించిన రెండింటియందు వాడబడిన ప్రాకృతము భిన్నశాఖలకు జెందినదని సులభముగా గ్రహింపవచ్చును.

భాసనాటకచక్రమునందలి రూపకములన్నియు దక్షిణదేశములో 'గ్రంథ'లిపి లోనే లభించినవి. కాని యజ్ఞఫలనాటక మాతృకలైన రెండు ప్రతులు ఉత్తరదేశమున లభించుటమాత్రమే కాక వాని లిపియు దేవనాగరియగుట గమనింపదగినది. వీని నన్నిటిని పరిశీలించినను యజ్ఞఫలము భాసునిది కాదేమో అను 'భ్రమ' కలుగక మానదు. భాసుడు వ్రాసెనో లేదో కాని భాసునివని చెప్పబడు రూపకముల కర్త యజ్ఞఫలమును వ్రాయలేదని నేను నమ్ముచున్నాను. తక్కిన విషయము లెట్లున్నను యజ్ఞఫలములోని ద్వితీయ షష్ఠాంకములు మాత్రము భాసునివి కానేరవు. విదూషక సృష్టి, మంథరావిషయముకూడ ఏ ప్రయోజనము సాధించినవో చెప్పజాలము.

ముందటి పదమూడు నాటకముల రచించిన కవియే యజ్ఞఫలనాటకమును వ్రాయలేదనియు, యజ్ఞఫలము తక్కినవానివలె జాల ప్రాచీనము కాదనియు నిరూపించుటయే నా యిచ్చటి ప్రయత్నము. యజ్ఞఫలనాటకమంతయు పనికిమాలిన రచనయని నా ఉద్దేశముకాదు. వానితో బోల్పకుండ ప్రత్యేకముగ జూచినచో షష్ఠాంకముగూడ విమర్శింపదగినదికాదు. దానిని వదలినచో తక్కిన కథాభాగ మంతయు వీరరసపోషకమే కాని శృంగారరసపోషకముకాదు. కావున నిజముగా కవి పోషింపదలచిన రసమేదియో నిశ్చితముగా తెలియలేదు. పంచమాంకగాథ చాల క్రొత్తపద్ధతిలో నడచినను మిక్కిలి అందముగానున్నది. ప్రశంసింపదగిన ఘట్టము లీ నాటకములో పెక్కులున్నను వానిని వదలుట నా ఉద్దేశము వేరై యుండు ననే కాని నాటకము పనికిరానిదని నిరూపించుటకుకాదు.

1. Swapnavasavadatta — Edited by Sri Ganapati Sastri — Introduction.

# "இலக்கண ஆராய்ச்சி"

கோ. பாலசுந்தர நாயகர், எம். ஏ.,

தமிழ்த் துறைத் தலைவர்,

திருவேங்கடவன் பல்கலைக் கழக ஆராய்ச்சிக் கழகம்.

உலகம் எப்போது படைக்கப்பட்டதென்று திண்ணமாய் எவராலும் கூறமுடியாது. அதற்குத் தக்க சான்று எதுவும் இல்லை. முதன் முதல் மக்கள் படைக்கப்பட்டபோது அவர்கள் எவ்வாறு ஒழுகினர்? எம்மொழியைப் பேசினர்? அம்மொழி எவ்வாறு தோன்றிற்று? என்பன போன்ற வினாக்களுக்கு விடையிருத்தல் எளிதன்று. வெறும் ஊகத்தான் மட்டும் ஒரு சிலவற்றிற்கு விடை கூறுவர் ஒரு சிலர்.

உலகம் பலவகைப்பட்ட பிரிவுகளையுடையது; ஒவ்வொரு பிரிவிலும் தட்ப வெப்ப நிலைகளும், உயிர்வாழ் பொருள்களும், உணவு, உடை முதலியவைகளும், ஒழுகலாறுகளும், வேறுபடுதல் இயல்பேயாம். அங்ஙனமே, அவர்கள் மொழியும் வேறுபட்டவைகளாக இருக்கின்றன. எல்லா மக்களும் ஒரே மொழியைப் பேசுதலாகாதா? அங்ஙனமாயின் உலகமக்கள் அனைவரும் மொழிபற்றி ஒரே குடும்பத்தினராக இருத்தல் இயலுமே; மொழிபற்றிய வேறுபாடுகளும் உயர்வு தாழ்வுகளும் இல்லாமல் இருக்கலாமே என எண்ணும் அறிஞரும் உளர். ஆயின், அஃது இயற்கைக்குப் பொருந்தாது என்ப.

பல்லாயிரம் ஆண்டுகட்குமுன் மக்கள் தம் கருத்தைப் புலப்படுத்துதற்காகச் சில ஒலிகளை உண்டாக்கிக் கொண்டனர். அவ்வொலிக் கூட்டத்திற்கு மொழி எனப் பெயர் கூறினர். மக்கள் கூடி வாழத்தொடங்கிய காலத்துத்தான் அவர்கட்கு மொழியின் இன்றியமையாமை புலப்பட்டது. அதனால் மொழி தோன்றிற்று என்பர் சிலர். மொழி தோன்றியது எவ்வாறு என்பது குறித்து மொழி நூல் வல்லுநர் கூறுமாறு எங்ஙனம் என்பதை அறிவோம்:

"உலகம் தோன்றியவுடன் தோன்றிய மக்கள் ஒன்றுகூடி இச்சொல் இப்பொருளையுணர்த்துமென முடிவு செய்தனர்" என்பர் ரூஸோ. "வாழ்க்கையில் ஆணும் பெண்ணும் கூடி வாழ்ந்தபோது அவர்களிடையே இன்பம், துன்பம், சினம் முதலியவை உண்டாதல் இயல்பே. அவ்வப்போது அவற்றைக் குறிக்க அவர்கள் தம்மையறியாமல் சில ஒலிகளை எழுப்பினர். அவ்வொலிகளினின்றும் மொழி தோன்றிற்றென்றும், அதுவும் நாளடைவில்

தோன்றியதே என்றும்" ப்ரீல் (Breal) கூறினார். "மக்களைப் படைத்த கடவுளே மொழியையும் படைத்தனர்" என்பர் ஸ்விஸ்மிக் (Swismilch). இது நமது புராணவரலாறுகளை ஒத்தது.

"இறைவனே மொழியைப் படைத்தான் எனில் அதில் குறைபாடு ஒன்றும் இருத்தலாகாது. ஒவ்வொரு மொழியிலும் குறைபாடுகள் காணப் படுகின்றன. அவை செப்பம் செய்யவும் பெறுகின்றன. ஆகலின், மொழிகளை இறைவன் தோற்றுவித்தனன் என்பது பொருந்தாது; எனினும் மக்கள் கூடி, தம் அறிவின் திறத்தால் மொழிகளை உண்டாக்கிக் கொண்டனர் என்பதோவெனில் அதுவும் பொருத்தமற்றது. ஆகலின், மக்கள் தம்மை யறியாமலேயே மொழிகளைத் தோற்றுவித்துக் கொண்டனர். மொழி யியல்பாகவே அவர்களிடமிருந்து உண்டாகியிருத்தல் வேண்டும்" என்பர் ஹெர்டர் (Herder). இங்ஙனம், மொழிநூல் வல்லோர் கூறிவருகின்றனர். எனினும் அவர் தம் முடிவுகள் முடிந்த முடிபுகளல்ல.

நம் நாட்டுப் பெரியோர்கள் மொழி இறைவனால் தோற்றுவிக்கப்பட்டதென்றும், 'ஓம்' என்னும் பிரணவத்திலிருந்து மொழிகளும், எழுத்துக்களும், உலகங்களும் உண்டாயின என்றும், அதனால் மொழிகளும் பிறவும் தெய்வத்தன்மை உடையவை என்றும் கூறுவர். இவ்விரண்டு கொள்கைகளுள்ளும் இக்காலத்துள்ளவர்களிற் பெரும்பாலோர் மொழிநூல் வல்லார் கொள்கைகளையே பெரிதும் ஆதரிக்கின்றனர். வேறு ஆராய்ச்சி முடிவுகள் வரும் வரையில் மொழிநூலார் கொள்கையை நாமும் பின்பற்ற வேண்டியவர்களாகின்றோம்.

உலகத்து மொழிகளை "இண்டு யூரோபியன்" மொழிக் குடும்பம் எனவும், "திராவிட மொழிக்" குடும்பம் எனவும் பகுத்து ஒவ்வொரு குடும்பத்திற்கும் சில ஒத்த மொழிகளை உரிமையாக்கி, அவ் வொற்றுமைகள் இன்னின்னவென்றும் விளக்கி நூல்களை எழுதியுள்ளனர் அறிஞர். அவ்வாறு எழுதப்படும் நூல் மொழிநூல் (Philology) எனப்படுகின்றது. இம் முயற்சி ஏறக்குறைய இரண்டு நூற்றாண்டுகளாகத்தான் அறிஞர்களால் மேற்கொள்ளப்பட்டது இத் துறையில் நம் நாட்டினர்க்கு வழிகாட்டி ஊக்கினவர்கள் மேல் நாட்டினரே யாவர்.

திராவிட மொழிக் குடும்பம் என்பது தமிழ், தெலுங்கு, கன்னடம், மலையாளம், துளு என்னும் ஐந்து மொழிகள் சேர்ந்த கூட்டம். இம்மொழிகளின் தன்மைகளும், அமைப்பும், இலக்கண முடிபுகளும் பெரும்பாலும் வேறுபாடில்லாமல் இருக்கின்றன. பல ஒற்றுமைகளைக் கருதியே இம் மொழிகள் ஒரே குடும்பம் எனப்பட்டன. இங்கு அவற்றை விரித்துரைப்பது என் நோக்கமன்று. கால்டுவெல் ஐயர் எழுதிய திராவிடமொழிகளின் ஒப்பிலக்கணம் என்னும் நூலிற் காண்க.

